# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

OFFICIAL REPORT

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Wednesday, the 5th December* 1956

The House met at Ten of the Clock

[*Mr Speaker in the Chair*]

## QUESTIONS AND ANSWERS

[No Questions Part I not published]

### Papers laid on the Table of the House

*Mr Speaker* The hon Minister for Agriculture, Sri P Thimma Reddy will lay on the Table of the House the Hyderabad Agricultural Debtors' Relief (Amendment) Ordinance, 1956

*The Minister for Agriculture* (*Sri P Thimma Reddy*) Mr Speaker, Sir, " I beg to lay on the Table of the House a copy of the Hyderabad Agricultural Debtors' Relief (Amendment) Ordinance, 1956"

### Motion under rule 74 of the Andhra Legislative Assembly Rules

*Mr Speaker* Before we take up the next item on the agenda, I want to draw the attention of the Government to a request made by the hon Member Sri G Yellamanda Reddy with regard to non publication of rules for the enforcement of the Andhra Tenancy Act, 1956 The request is as follows,

"ఈ క్రింద కనపరచిన ప్రజలకు సంబంధించిన అత్యవసర సమస్యపై గౌరవనీయులైన రెవిన్యూ మంత్రిగారు శ్రద్ధ కనపరచాలని కోరుతున్నాను ఆంధ్ర కౌలుదారీ చట్టం పాసై మూడు మాసాలయినా యింతవరకూ rules తయారుచేసి ప్రకటించలేదు దీనిని అదనుగా తీసుకొని గ్రామాలలో భూస్వాములు అసలు కౌలుదారీచట్టం రాలేదనీ, వచ్చినా యీ సంవత్సరం అమలు జరుపరని కౌలుదారులను భూములనుంచి తొలగించుచున్నారు" ఇదీ వారు చేసిన అభ్యర్థనను యల్లమందారెడ్డిగారు దీనిపై మూడు నిమిషాలు మాట్లాడ వచ్చును మంత్రిగారు దానికి సమాధానం చెబుతారు

*శ్రీ జి యల్లమందారెడ్డి (కనిగిరి)—అధ్యక్షా, ఈ కౌలుదారీ చట్టం pass చేసి మూడు నెలలయినప్పటికీ యింతవరకు ప్రభుత్వంవారు నిబంధనలు తయారు చేసి ప్రకటించ డానికి ఏమాత్రము శ్రద్ధ తీసుకోలేదు అందువల్ల మనం కౌలుదారీ చట్టమును ఏ వుద్దేశ్యముతో pass చేసినా, దాంట్లోవున్నటువంటి కనీస సౌకర్యాలు కూడా కౌలుదారులకు అందకుండా భూఖామందులు కౌలుదారులను వెళ్ళగొట్టడానికి చట్టం యింకా అమలులోనికి రాలేదని అనేక విధాల మభ్యపెట్టడానికి ప్రయత్నం చేస్తున్నారు రెండోవైపున కౌలుదారులు తహసీల్దారుకు అర్జీలు పెట్టుకొన్నప్పుడు ప్రభుత్వోద్యోగులయినటువంటి తహసీల్దారు తమకింకా నిబంధనలు రాని కారణంగా వానిని తీసుకోడంలేదని చెబుతున్నారు అందువల్ల రెవిన్యూ మంత్రిగారు వెంటనే ఈ విషయమై శ్రద్ధ తీసుకుని నిబంధనలు ప్రకటించి తద్వారా కౌలుదారులకు రక్షణ కలిగించాలని మీద్వారా నేను మనవి చేస్తున్నాను

*ముఖ్యమంత్రి (శ్రీ ఎన్ సంజీవరెడ్డి) —అధ్యక్షా, రెవిన్యూమంత్రిగారింకా రాలేదు, కనుక నేను సమాధానం చెబుతున్నాను ఈ విషయమై తొందరపాటుతో కార్యక్రమం ఏదో ఒక రకంగా సాగించాలనే ప్రయత్నం లేకుండా చూసుకోవాలి ఈ చట్టం ఆంధ్రరాష్ట్ర శాసనసభలో pass అయిన మాట నిజమే కాని యీచట్టములన్నీ ఏవిధంగా సమన్వయపరచాలి హైదరాబాదు శాసనసభలో చేసిన తీర్మానాలను ఆంధ్ర శాసనసభ చేసిన తీర్మానాలను ఏరకంగా సమన్వయపరచి ఏ ప్రాంతానికి ఏవేవి అన్వయించాలి అనే దానిని గురించి పరిశీలన చేయడానికి నిపుణుల సంఘంద్వారా Secretariat లో కృషి జరుగుతోంది ఇంతలోపలనే దానిని వెంటనే అమలు పరచలేదని మిత్రులు అనుకోవడం, లేదా నిబంధనలు తయారు చేయకుండా ఏదో నిరీక్షిస్తున్నారనుకోవడం చాలా పొరపాటు పరిశీలన జరిగిన తర్వాత ఏ చట్టాన్ని ఎట్లా అన్వయించాలో ప్రభుత్వం ఆలోచిస్తుంది వీలయినంత త్వరలో పరిశీలన పూర్తయిన తర్వాత అమలు జరపడానికి సాధ్యమవుతుంది గాని అంత త్వరగా సాధ్యంకాదని చెబుతూ, ఇదీ తక్షణం తీసుకోవలసిన emergent business కాదు గనుక కొంత వ్యవధి యివ్వవలసినదని కోరుతున్నాను

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ)—On a point of information, Sir ముఖ్య మంత్రిగారు సమాధానం చెబుతూ నిబంధనలు తయారుచేయు డానికి నిపుణుల సంఘ మును నియమిస్తామన్నారు నిపుణుల సంఘంలో యింకా నిర్మాణాత్మక సూచనలుచేయడానికి అవకాశం కల్పించేందుకు ప్రతిపక్షంనుంచికూడా కొంత మందినిచేరిస్తే యింకా చురుకుగా పని సాగించడానికి వీలుంటుంది గనుక ప్రతిపక్ష సభ్యులను కూడా చేర్చి నిపుణుల సంఘమును నియమించడానికి పూను కుంటారా?

శ్రీ ఎస్ సంజీవరెడ్డి నిపుణుల సంఘములో అనధికారులు (Non-official element) ఉండరు Legal Secretariat లోని యిద్దరో, ముగ్గురో officers ఉప సంఘంగా తయారై పరిశీలన చేస్తున్నారు ఈ ఒక్క సమస్యగురించే కాదు అన్ని చట్టాల గురించి ఆంధ్రరాష్ట్ర చట్టాలు, హైదరాబాదు చట్టాలు యివన్నీ పరిశీలన చేసి ఏదో ఒక రకంగా మార్పుచేయాలని పరిశీలన చేస్తున్నారు ఆ నిపుణుల సంఘంలో శాసన సభ్యులు, కాంగ్రెసు పక్షం నుంచిగాని, ప్రతిపక్షాలనుంచిగాని ఉండరు అధికార స్థాయి, (Official level) లో పరిశీలన జరుగుతుంది

[Sri Pillalamarri Venkateswarlu and Sri B Sankaraiah rose in their seats ]

*Mr Speaker* Order, Order The discussion on this subject is closed

## Motion under rule 70 of the Assembly Rules to discuss rise in the prices of food grains

మిస్టర్ స్పీకర్ —ధరలు చాలా పెరిగినాయి కనుక శాసన సభ నిబంధనలోని ౭౦వ నిబంధన క్రింద చర్చ జరుపడానికి time యివ్వవలసినదని శ్రీ యెల్లమందారెడ్డిగారు కోరుతున్నారు అయితే దానికి యివ్వాళ అవకాశంలేదు ఇదివరకు ఆంధ్ర శాసన సభలో అనేక సార్లు దీని విషయమై చర్చజరిగింది అదీకాక యివ్వాళ తొందరగా వెళ్ళుతున్నాం, అందువల్ల యిప్పుడు దానిని గురించి ఏమీ చేయడానికి అవకాశంలేదు

## Point of information re: Question Hour

శ్రీ ఎస్ వేమయ్య (బుచ్చిరెడ్డిపాలెం—రిజర్వుడు) On a point of information, Sir, మనం మామూలుగా ప్రతి రోజూ మొదటి గంట ప్రశ్నలకుఉపయోగిస్తూ వచ్చాం ఇది కొత్తగా వచ్చిన Assembly కాదనడానికి దీనిని Fourth Session of the Assembly గా continue చేయడమే తార్కాణం అటువంటప్పుడు ప్రశ్నలగంటను కేటాయించకుండా ఉండిపోవడానికి కారణం ఏమిటి ? ప్రశ్నలులేవనుకోడానికి వీలులేదు ప్రశ్నలు చాలా యివ్వబడివున్నాయి ఎందువల్ల గత రెండు రోజులు ప్రశ్నలగంటు లేకుండా పోయిందో మంత్రులవద్దనుండి తెలుపవలసినదిగా తమ ద్వారా కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ ఇది కొత్త Assembly కనుక వున్న urgent పనిని త్వరగా చేసుకుందామని మామూలు పద్ధతిని తప్పించారు ఇదిగవర్నరుగారు ఏర్పాటు చేసిన కార్యక్రమం వచ్చే దఫా అన్ని ప్రశ్నలకు మంత్రులు జవాబులు చెబుతారు

**Sri M Buchiah (Sirpur)* Sir, I rise on a point of information It has been mentioned by the Chair that this is the first session of the Andhra Pradesh Legislative Assembly

whereas we have been asked by the Legislature Secretariat to take this as the fourth session of the Assembly Hence I request you to clarify

*Mr Speaker* This is the first session of the Andhra Pradesh Legislative Assembly, *i e*, after the enlargement of the Andhra State into the Andhra Pradesh Therefore, it has some characteristic features of a new Assembly and at the same time is also a continuation of the previous Assembly

The Hon Member Sri B Sankaraiah will now speak

శ్రీ ఎస్ వేమయ్య On a point of Information, Sir గౌరవనీయులైన వ్యవసాయశాఖా మాత్యులు ఒక తీర్మానం బల్లమీద పెట్టారు దానికి సంబంధించిన Amendment మాకు అందలేదు దానిని వారు ఊరికే move చేశారు గాని, వారి amendment అందచేయలేదని మీద్వారా చెబుతున్నాను

## Election of Deputy Speaker

*శ్రీ జి శ్రీరాములు (మంథని) — Rules ప్రకారం Speaker గారి ఎన్నిక జరిగింది Deputy Speaker గారి ఎన్నిక, నిబంధన (rule) 8 ప్రకారం ఇప్పుడు చేయడానికి వీలులేదు తమరు date fix చేయాలి అదెప్పుడు fix చేస్తారో దయచేసి చెప్పాలని కోరుతున్నాను ఏడు రోజులనిగాని, పదిరోజులనిగాని దానికి కాలవ్యవధిలేదు రేపు కూడా పెట్టవచ్చు త్వరలో ఎన్నికయిపోతే బాగుంటుంది కనుక ఈ సూచన తీసుకోవలసినదని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ —వ్యవసాయి శాఖామాత్యులు చెప్పినటువంటి విషయాలు మీ ఎదుటకు వచ్చినాయి వాటిని గురించి ఇప్పుడాలోచించండి వచ్చే సమావేశంలో దానిని గురించి చర్చించవచ్చు

They will be placed on the Table of the House by the beginning of the next meeting

ఇప్పుడూరికే చెప్పినారు తొందర ఏమీలేదు డిప్యూటీ స్పీకరు ఎన్నిక ఇప్పుడు పెట్టడంలేదు దానికి ఇన్నాళ్ళ వ్యవధి ఇవ్వాలని ఏమీలేదు ఇప్పుడు కొద్ది గంటల వ్యవధి మాత్రమే ఇస్తే ప్రతిపక్షంవారికి ఆలోచించుకునే వ్యవధి లేకపోవచ్చును వారు తరువాత మరొకరిని పోటీ పెట్టక పోవచ్చును అయినా వారికి కూడా ఇట్టి అవకాశం ఇవ్వాలి ఈ రోజునే డిప్యూటీ స్పీకరు ఎలక్షన్ పెట్టక పోతే వచ్చేనష్టం ఏమీలేదు పాత డిప్యూటీ స్పీకరుగారే కొత్తడిప్యూటీ స్పీకరుగారు వచ్చేవరకు నాకు మద్దతు చేస్తుంటారు వచ్చు సమావేశంలో మొదటి item గా డిప్యూటీ స్పీకరు ఎన్నిక పెడతామని మనవి చేస్తున్నాను

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —అధ్యక్షా, తమరు చెప్పిన దానిలో ఒక సూచన, కనిపిస్తోంది అది ఏమిటంటే డిప్యూటీ స్పీకరు పదవి ప్రతిపక్షానికి ఇచ్చేట్లు కనిపిస్తోంది అటువంటిదేమైనా ఉన్నదేమో ప్రభుత్వ పక్షాన్ని కనుక్కుంటారా ?

మిస్టర్ స్పీకర్ —ప్రతి పక్షానికి ఇవ్వాలనిగాదు నేను చెప్పింది స్పీకరు ఎన్నికకు ముందు కొంత అవకాశం ఉండడంవల్ల ఇష్టమైతే పోటీ పెట్టడానికి వారికి అవకాశం ఉండినది వారు దయచేసి పోటీ పెట్టలేదు డిప్యూటీ స్పీకరు ఎన్నికకు కూడా పోటీ పెట్టకపోవచ్చును కాని వ్యవధి మాత్రం ఇవ్వకపోవడం న్యాయంకాదు నాలుగు గంటలలో ఎన్నికపెట్టడానికి వ్యవధిలేదు **Andhra University** లో కొన్ని ఎన్నికలకోసం కొంతమంది సభ్యులు ఈ రోజు వెళ్ళనున్నారు ప్రస్తుతం చర్చను 1–30 గంటలకు ముగించి ఈసభ ఇంతటితో చాలిస్తున్నాము కనుక వేరే విషయాలు తీసుకోడానికి అవకాశం లేకపోయింది

## Member sworn

మిస్టర్ స్పీకర్ —గౌరవ సభ్యుడు శ్రీ గంగుల భూమయ్యగారు ప్రమాణం స్వీకరించాలని కోరుతున్నాను

*Sri Gangula Bhoomayya (Metpalli)*

## Resolution regarding the Creation of Second Chamber in the Andhra Pradesh State

*శ్రీ బి శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం—జనరల్) —అధ్యక్షా, ఎగువ శాసనసభ రాష్ట్రములో వుండాలా, అక్కరలేదా, అనే విషయం ఆంధ్రప్రదేశ్‌లోనే కాకుండా దేశంమొత్తం మీదనే ఇదివరకు అనేక సార్లు చర్చించబడింది బ్రిటిషు ప్రభుత్వం అధికారంలో వున్నప్పుడు ఇదివరలోనే కొన్ని రాష్ట్రాలలో రెండవ శాసనసభను ఏర్పాటు చేసింది కేంద్రంలో కూడా రెండవ శాసనసభను ఏర్పాటు చేసింది ఆ రోజులలో జాతీయోద్యమంలో పనిచేసే నాయకులు ఇప్పుడు ప్రతి పక్షంలో ఉన్నవారు మాత్రమే కాక ప్రభుత్వ పక్షంలో ఉండి అధికారంలో వున్నవారు కూడా రెండవ శాసనసభ వుండాలా, అక్కర లేదా అనే విషయం వచ్చేసరికి అటువంటి సభ అవసరం లేదని వ్యతిరేకించారు ప్రజలచేత ఎన్నుకోబడిన వారు అధిక సంఖ్యాకులుగా వచ్చి కేంద్రంలోకాని రాష్ట్రంలోకాని శాసనసభలలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా జాతీయోద్యమానికి అనుకూలంగా పని చేస్తున్నప్పుడు వారి చర్యలను అరికట్టడానికి, వారికి ప్రతిబంధకం కలుగచేయడానికి రెండవ శాసనసభలను ఉపయోగించుకొనే వారనే విషయం అందరికీ తెలుసును రెండు శాసనసభలు అన్ని రాష్ట్రాలలోను ఉన్నాయా అంటే లేవు అన్ని రాష్ట్రాలలోను ఏర్పాటు చేయాలని ఈరోజున ఖచ్చితంగా అందరు అభిప్రాయపడటంలేదు ప్రతిపక్షంలో వున్నవారు మాత్రమే కాదు జాతీయోద్యమంలో పాల్గొన్న వారే, ప్రభుత్వ పక్షంలో ఉన్నవారే రెండవ శాసనసభ అధికారాలను గురించి, అది వుండవలసిన అవసరాన్ని గురించి అభిప్రాయాలను రోజు రోజు మార్చుకుని వెలిబుచ్చుతున్నారు అన్ని రాష్ట్రాలలోనూ ఏర్పాటు చేయాలని ఇంకా నిర్ణయం తీసుకో

నేలేదు అధిక సంఖ్యాకులు pass చేస్తే చేయడానికి లేదు ముఖ్యమంత్రిగారు చెబుతూ రెండు శాసనసభలలోనూ ఇదివరకే pass అయినది కనుక ఎక్కువ చర్చ అక్కరలేదు అన్నారు కాని హైదరాబాదు శాసనసభలో ఈ విషయంగురించి తీర్మానం pass చేసినప్పుడు తగిన సంఖ్యాబలం లేదని అందరికీ తెలిసినదే అందువల్లనే కేంద్ర ప్రభుత్వంవారు ఈ విషయమై తిరిగి శాసనసభలో చర్చ చేయాలని చెప్పారు కేంద్రంలో ఉన్న రెండు శాసనసభలలోను ఎగువ సభ ( Council of States ) కులధికారం తగ్గించాలని ప్రజాప్రతినిధులకు ఉండే అధికారంతో సమాన అధికారం, హోదా ఇవ్వడానికి వీలులేదని ప్రధాన మంత్రి నెహ్రూగారు తెలియచేసిన విషయం నిన్ననే తమ దృష్టికి తీసుకు వచ్చినారు అయితే దేశం మొత్తంమీద కేంద్రంలో రెండవ శాసనసభ ఉండే విషయం వేరు ప్రతి రాష్ట్రానికి ఉండాలా లేదా అనే విషయం వేరు దీనిని మరల పరిశీలించాలని కోరుతున్నారు ప్రజలందరికీ సమాన ప్రాతినిధ్యం పద్ధతిలో కాకుండా చిన్న పెద్దగా ఉండే వివిధ రాష్ట్రాల సమస్యలను జనాభా ప్రాతిపదికమీద కాకుండ రాష్ట్రాల ప్రాతిపదిక మీద చర్చించి వాటికి కొన్ని రక్షణలు కల్పించడానికి విభిన జాతులు కలిగిన మన దేశంవంటి దేశంలో రెండవ శాసనసభ దేశం మొత్తంమీద ఉండవచ్చుననే విషయం వేరు, ప్రతి రాష్ట్రానికి ఉండడంవేరు ముఖ్యమంత్రిగారు మాట్లాడుతూ ఇటువంటి ఎగువసభలు అమెరికాలోను, రష్యాలోను కూడా ఉన్నాయి అన్నారు అమెరికాలో కాని రష్యాలోకాని మరెక్కడా కాని రాష్ట్రాలలో ఎగువసభలు లేవు ఆ విషయం వారు తెలియ చేయలేదు దేశానికంతకు కలిసి జనాభా ప్రాతిపదికక్రింద మాత్రమే కాక రాష్ట్రాల ప్రాతిపదిక క్రింద, వివిధ రాష్ట్రాలమధ్య ఉండే హక్కులు కాపాడే విషయంలో రెండు శాసనసభలు అమెరికాలో రష్యాలో వున్నాయి కాని ప్రతి రాష్ట్రానికి లేవు రెండవ శాసనసభవల్ల డబ్బు ఖర్చు మాత్రమే కాదు శాసనాలు చేయడంలో కూడా ఆలస్యం అవుతుంది దేశంలో అనేక సంస్కరణలను అమలు జరిపి ముందుకు తీసుకు పోవాలని ప్రయత్నం చేస్తున్నాము అనేక రకాలైన ఆర్థిక ఇబ్బందులవల్ల తక్షణం పరిష్కరించవలసిన సమస్యలను కూడా వాయిదా వేసే ప్రమాదం ఎదుర్కొంటున్నాము ఈ ఆర్థిక లోటువల్ల చిన్న వ్యవహారాలను కూడా చేయలేక పోతున్నాము

ఈ పంచవర్ష ప్రణాళికను జయప్రదంచేయటానికి మనకున్నటువంటి resources అన్నిటిని ఉపయోగించవలసినటువంటి పరిస్థితిలోవున్నాము అందువల్ల కొన్ని లక్షల రూపాయలు ఖర్చుపెట్టి యివ్వాళ, కొన్ని చిన్న సమస్యలను పరిష్కరించటం వాయిదా వేసుకొని ఆడబ్బుతో ఈ ఎగువసభను ఏర్పరచుకోవడం సమంజసంకాదు ఈ పంచవర్ష ప్రణాళిక అమలు జరిగిన దానివల్ల వచ్చే అభివృద్ధికోసం, మనం పాటుపడాలి అటువంటి సమయంలో ‘ ఆర్థిక అభావం ’ అనేది చిన్న విషయం కాదు ఈ విషయమును దృష్టిలో పెట్టుకొని, మంత్రి వర్గము ఆలోచించినట్లులేదు అంతేకాకుండా యిప్పుడు మనం నూతనంగా ఆంధ్రప్రదేశ్ ను ఏర్పాటు చేసుకొన్నాము ఇటువంటప్పుడు మనమందరము, అంటే అన్ని రాజకీయ పార్టీలు, Opposition party తో కలసి చేయవలసిన సంస్కరణలు అనేకము ఉన్నప్పుడు, ఈవేళ, ఈ మూడు రోజులు జరిగినటువంటి ఈ ఎసంబ్లీ సమావేశములో ఈ విషయమునే తక్షణము తీసుకువచ్చి పెట్టవలసిన అవసరము ఏమివున్నది? వెనుకటి హైదరాబాద్ శాసనసభలో ఇట్టి

తీర్మానానికి తగిన సంఖ్య రాలేదు కాబట్టి, సంజీవరెడ్డిగారు చెప్పినట్లు, ఆంధ్ర ప్రదేశ్ లోని ప్రజలందరు దీనిని అంగీకరించినట్లని మనము అనుకొనుట ఎట్లు? ఇప్పుడు కౌన్సిల్ వుండాలి అని మనం ఒక తీర్మానము pass చేసిన తరువాత, ఢిల్లీలో వున్నటువంటి ప్రభుత్వము దీనిని ఏర్పాటు చేస్తుంది కాంగ్రెస్ పార్టీవారు "ఈ రెండో శాసనసభ ప్రజాస్వామ్యమును యింకా ముందుకు తీసుకుపోవటానికి, యింకా పెంపొందించటానికి తోడ్పడుతుంది" అని చెప్పారు ఈ విధంగా కౌన్సిలు లేనందువలన, ఎక్కడైనా democracy కుంటుబడింది అనేందుకు ఉదాహరణ ఏమైనాచెప్పారా? ప్రజలచేత ఎన్నుకోబడినటువంటి ప్రతినిధులలో democracy ని అభివృద్ధి చేయుటకు బదులు, కొంతమందిని nomination ద్వారా, కొంతమందిని indirect election ద్వారా ఎగువ శాసన సభకు తెచ్చినట్లైతే, democracy కుంటుపడుతుందని చెప్పుతున్నాను ఆవిధంగా ఏర్పాటు చేయబోయే కౌన్సిల్ democracy ని అభివృద్ధి చేస్తుంది అని వాదించటం కేవలం హాస్యాస్పదమైన విషయము కొంతమందిని nominate చేయడము, లేదా పరోక్షపు ఎన్నికలు జరిపించటము, ఇటువంటివి నిజముగా democracy కి ప్రత్యక్షముగా విరుద్ధమైనవి ఇలాంటి అనేక విషయాలతో కూడుకొన్నటువంటి కౌన్సిల్‌ను ఏర్పాటు చేయటం, democracy ని అభివృద్ధి చేయటానికే అని చెప్పటం ఎవరూ నమ్మదగిన విషయముకాదు

ఇకపోతే, ప్రతిభావంతులను తీసుకురావటానికి ఇది ఉపయోగ పడుతుందని చెబుతున్నారు కాని, యిప్పుడు, ఈ కౌన్సిల్ వున్న రాష్ట్రాలలోగాని, కేంద్రములోగాని, ప్రభుత్వముచేత nominate చేయబడినటువంటి వారిని పన్నెండవ వంతు అయినా ప్రతిభావంతులను nominate చేస్తున్నారా అంటే, ఎక్కడో, లక్కడక్కడ, ఒకరిద్దరిని చేయవచ్చు కాని, ఎక్కువ మందిని, ప్రజల చేత ఓడింప బడినవారినో, లేక, యింకో విధంగా రాజకీయ పార్టీలకు సంబంధించినటువంటివారినో, తీసుకు రావటానికి ఇది వినియోగించటము జరుగు తున్నది కాని, ప్రతిభావంతులను nominate చేయటంగాని, లేదా select చేయ టంగాని జరుగుటలేదు ఎందువల్ల? ఎప్పుడైతే దేశంలో, రాజకీయ పార్టీలు, బలమైన పార్టీలుగా ఏర్పడినాయో, అప్పుడే అసెంబ్లీలో వున్న ఆ రాజకీయ పక్షాలకు సంబంధించిన వారు బలపర్చిన వారే, కౌన్సిల్‌లోనికి ఎక్కువ భాగం రావటానికి అవకాశం వుంది కేవలం ప్రతిభావంతులను nominate చేయాలన్నప్పుడు, అన్ని పక్షాలు కలసి ఆలోచించవచ్చు ఆవిధంగా ప్రతిభావంతులు పోటీలేకుండా ఎన్నుకొనేట్లు చేయటానికి, అధికారములో వున్నటువంటి పక్షము నిజంగా దేశములో ప్రతిభావంతుల ప్రతిభను వినియోగించాలని వాంఛించినట్లయితే, దానికి ప్రతి పక్షము ఎప్పుడు అడ్డుపడక పోవటమే కాకుండా, పూర్తి సహకారము ఇవ్వటానికి కూడా సిద్ధపడుతుంది అనేకసార్లు ఆంధ్రలో గాని, హైదరాబాదులోగాని, కేంద్రములో గాని ఈ విషయం ఒకటికి పది సార్లుచెప్పాము కాని యింతవరకు ఈ సూచనకు బదులు రాలేదు ఈ ప్రతిభావంతుల నందరిని వినియోగించుకోవటమే ప్రభుత్వ పక్ష ఉద్దేశ్యమైనట్లు మనకు స్పష్టంగా తెలుస్తోంది అటువంటప్పుడు కేవలం ఆ కారణాన్ని బట్టి ఇక్కడ కౌన్సిల్ తీసుకు రావాలని చెప్పటం సహేతుకంగా లేదు,

మనకు ఎన్నికలు రాబోతున్నాయి ఆంధ్ర ప్రదేశ్ అంతలో పార్లమెంటు ఎన్నికలు జరుగుతాయి ఇక్కడ కొన్ని జిల్లాలలోనే అసెంబ్లీకికూడా ఎన్నికలు జరుగుతాయి అందుచేత అన్ని రాజకీయ పక్షములు, ఈ విషయములో, అన్ని సమస్యలతో పాటుగా, ప్రజలముందు ప్రచారం చేసుకొనేటటువంటి ఒక పెద్ద అవకాశం కూడావస్తుంది ఎన్నికలు జరిగే లోపున, అంటే ఈ రెండు, మూడు నెలల్లోనే ఈ కౌన్సిల్‌ను ఏర్పాటు చేయటం అనేది అవసరమా ? అసల ఏర్పాటు చేయడం సాధ్యమౌతుందా ? పోనీ, వాస్తవిక విషయాలను బట్టి కూడా, యిప్పుడు తొందరగా ఏర్పాటు చేస్తే వచ్చేటటువంటి నష్టం ఏమిటో కూడా యింకా అనేకమంది సూచించారు

ఈ నాడు ప్రజా ప్రతినిధులతో కూడుకొన్నటువంటి జిల్లాబోర్డులు లేవు అటువంటప్పుడు స్థానికసంస్థలనుండి ఎన్నుకోబడినటువంటి వారు, పరోక్ష ఎన్నికలలో అయినాకూడా, అక్కడి ప్రజలు ఎన్ను కొన్నటువంటి ప్రతినిధి లేనటువంటి స్థానిక సంస్థలనుంచి, ఎన్నుకొనడం చాల విచారకరమైన విషయము ఇటువంటి పరిస్థితులన్నీ తెలిసికూడా యిప్పుడు తొందరపడి కౌన్సిల్ పెట్టటం ఎన్నికల ముందు దీనిని తీసుకురావటం ఎందుకు ? ఇంతలో దీనికి ఏవిధమైన ప్రమాదము లేదు ఈ విషయాన్ని బాగా ఆలోచించి ఇది ఎన్నికలు జరిగే వరకు వాయిదావేయాలని కోరుతున్నాను ఇది అన్ని పక్షాలు కలసి ఆలోచన చేసేందుకు వీలు లేనటువంటి సమస్యకాదు ఈ విషయంలో అందరూ కలసి ఆలోచించవచ్చు అయినా ఎన్నికలు అయిన తర్వాత అన్ని పార్టీలు కలసి కౌన్సిల్ వుండవలసిన అవసరం వున్నదా, లేదా అని ఆలోచించుకోవచ్చు ఎన్నికల్లో ప్రజాభిప్రాయం ఏవిధంగా వుంటుందో చూచి, ఈ విషయం ఆలోచించవచ్చు ప్రపంచంలో, ఏ ఒక్క దేశములోకూడా రాష్ట్రాలకు ఈ విధమైన శాసనసభలుండటము అవసరములేదు అందువల్ల ఒక రాష్ట్రంలోనేదామాషా ప్రకారము, ప్రజలచేత ఎన్నుకోబడినటువంటి వారు శాసన సభలో వుండేటప్పుడు, యింకా ఎక్కువ మంది కావాలనంటే, లక్షమందికి ఒకరనుటకుబదులు ౨౦ వేలకు ఒకరు చొప్పున తగ్గించి యింకా ప్రజా ప్రతినిధులు ఎక్కువ వచ్చేదానికి అవకాశం కలిగించండి అన్ని పక్షములు కలసి ప్రతిభావంతులను నిలబెట్టండి వాళ్ళ ప్రతిభనంతా ఉపయోగించుకోండి ఆవిధంగా మన ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధిచేయండి మనము, ఈ దేశములో ఈ ప్రతిభావంతుల ప్రతిభను అంతా వినియోగించుకొని దేశాన్ని త్వరితంగా అభివృద్ధి చేయటానికి కావలసినటువంటి అన్ని చర్యలు తీసుకొనే దానికి ఎటువంటి ఆక్షేపణలేదు కాని, యిప్పుడు మాత్రం, దీనిని వాయిదా వేయమని విజ్ఞప్తిచేస్తూ నేను విరమిస్తున్నాను

*శ్రీ టి పాపారావు (నాగరికటకము) అధ్యక్షా ! నిన్నటినుండి ఎగువ శాసనసభ ఉండవచ్చునా, ఉండకూడదా, అని తర్జనభర్జనలు జరుగుతున్నవి అయితే ఒక మహత్తర విషయము నిర్ణయించవలసి వచ్చినపుడు, ఆ విషయంపైన తర్జన భర్జనలు చేయటము, దాని మంచి చెడులను నిర్ణయించటం ఎంతయినా అవసరం అయితే, మన ఆంధ్రదేశానికి ఎగువ శాసనసభ ఎంతవరకు అవసరం అనేది మనం ఇప్పుడు ముఖ్యంగా నిర్ణయించవలసి వుంది,

ఎగువ శాసనసభ మనకు అవసరమేం కారణం, మనకు **Adult Franchise** వచ్చిన తరువాత, వయోజన వోటింగ్ పద్ధతి మీద ఓట్లు ఎక్కువగా సంపాదించే ఉద్దేశ్యం చేతగాని, మరికొన్ని ఉద్దేశ్యాల చేతగాని, తొందర తొందరగా దిగువ శాసనసభలో శాసనాలు చేయటం, ఆ చేసిన శాసనాలు స్థిరమైన రూపం దాల్చకపోవడం జరుగుతున్నది ఒకరూపం లేని ఒక నిర్ణయములేని శాసనాలు ఎంతవరకు ఉపయోగిస్తాయి ? అట్టి శాసనాలవల్ల కొంత మందికి అన్యాయం జరుగవచ్చు, కొంతమందికి న్యాయం జరుగవచ్చు ఎగువ శాసనసభ ఉన్నట్లయితే, అందులో చాలామంది పెద్దలు ఉంటారు ఈ శాసనసభఎన్నికలలో అల్లరులలో పడి, వయోజన వోటింగ్‌లోనికి రాకుండా ఉన్నటువంటివారు, దేశానికి వారి మేధాశక్తి ఎంతయినా అవసరం కలవారు, ఖైటవున్నారు అటువంటివారు శాసనసభ లోనికివచ్చి వారి మేధాశక్తి, వారి విజ్ఞానమును, వారి తాలూకు ప్రత్యేక విశిష్టమైె నటువంటి ఉద్దేశ్యములను దేశానికి, ప్రజలకు ఇచ్చి మంచి శాసనములు చేయుటంకావి, లేక కొన్ని శాసనములు వద్దని ఆటంక పర్చటానికికాని వారి సలహా సంప్రదింపులు ఎంత అయినా మనకు అవసరం

రాష్ట్రానికి **deficit budget** ఉన్నదనో, లేక ఎక్కువ డబ్బు ఖర్చు అవుతున్న దనో, లేక కొంతమంది సభ్యులు మర్యాదకు ఓర్చియో, మాట్లాడినారు ఈ ఎగువ సభకు నాలుగు లక్షలు ఖర్చుచేయడము ఏమంత పెద్దఖర్చు కాదు గనుక **administration** చక్క దిద్దటానికి మేధాశక్తుల యొక్క అభిప్రాయములు, వారి బుద్ధిబలమును, విజ్ఞానమును ఉపయోగించుకుని దేశాన్ని మరింత ఉన్నతస్థాయిలోకి తీసుకవచ్చి నడుపు కోవటానికి వీలుగా ఉంటుంది అన్నారు ఈ విషయము నిజమే కాబట్టి ఈ నాలుగు లక్షలు మన రాష్ట్రమునకు ఏమంత పెద్దబరువు కానేరదు కాబట్టి మనము ఈ ఎగువ సభను ఏర్పాటు చేసుకోటానికి ఒప్పుకుని ఈనాడు అందుకు తేబడిన తీర్మానమును బలపరచవలెనని కోరుతున్నాను మనము సుమారు నలభై సంవత్సరములుగా ఆందోళనచేసి ముక్కోటి ఆంధ్రులను ఒక్క చోటుకు సమీకరించు కున్నాము ఇంకను అక్కడక్కడ ఆంధ్రులు మిగిలి పోయినను, వీలైనంత మందిని ఒకచోటకు చేర్చుకున్నాము ఆంధ్రులందరు అక్కడక్కడ ఉండిపోవడము వల్ల, మన ఆంధ్ర రాష్ట్రము ఛిన్నాభిన్నములై వెనుకబడి పోయింది ఇప్పుడు మన దేశము పురోగమించాలంటే, రాష్ట్రములోని మేధావంతుల యొక్క విజ్ఞానమును మనము ఉపయోగించుకుని, దేశమును ఆదర్శ ప్రాయముగా చేసుకొనుటకు మనము ఎంతో ప్రయత్నించవలసి యున్నది కనుక మనకు ఈ ఎగువ సభ ఏర్పాటు అవసరమై యున్నది అందువల్ల ఎగువసభ ఏర్పాటు ఏమంత విలంబన లేకుండా, త్వరలో ఏర్పడటానికి సభ్యులందరు తోడ్పడి, ఈనాడు ప్రభుత్వము తెచ్చిన తీర్మానమును తప్పకుండా బలపరచవలసిందిగా కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను

*శ్రీ బి రత్నసభాపతి (బద్వేల్) —అధ్యక్షా, మన రాష్ట్రమునకు ఎగువసభ వుండ వలెనా, లేదా ఇది అవసరమవునా కాదా, అనే విషయాన్ని గురించి నిన్నటినుంచి సుదీర్ఘమైన చర్చ జరుగుచున్నది సభలో కొందరు పెద్దలు నాయకులైనవారు ఇది వుండాలని, మరికొంత మంది అవసరము లేదని, వారి వారి అభిప్రాయములు తెలియజేశారు ముఖ్య మంత్రి సంజీవ రెడ్డి గారు ఈ విషయములో యిమిడివున్న సూత్రమును గురించి చెబుతూ, రాష్ట్రములో మంచి

అనుభవము గల మేధావంతుల యొక్క విజ్ఞానము మనకు లాభదాయకముగా వుంటుంది కాబట్టి వారిని ఈ ఎగువ సభలో వుంచడము అవసరము వారితో ఈ ఎగువ సభను ఏర్పాటు చేసుకుంటే, దేశమును మరింత ఔన్నత్యస్థితిలోకి తెచ్చుకోగలుగుతాం అందువల్ల యీ సభ అవసరమని చెప్పారు కాని, మన ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించినంతవరకు, హైదరాబాదు రాష్ట్రానికి సంబంధించినంతవరకు యీ ఎగువ సభ కాకుండా కొన్ని సాంప్రదాయాలను అనుసరిస్తూ వస్తున్నాము కాని ఒక్క విషయము మాత్రము మనవి చేయ దలచుకున్నాను ఇది సభ్యులందరూ గుర్తిస్తారని ఆశిస్తున్నాను మొట్టమొదట మనకు ఆంధ్రరాష్ట్రము ఏర్పడనున్న సమయములో మనము మద్రాసు స్టేటులో ఉండగా, ఆంధ్రరాష్ట్రపు బిల్లు చర్చకు వచ్చిన సమయములో, ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించిన శాసనసభ్యులందరూ మనకు శాసనసభ ఒక్కటి చాలు, ఎగువసభ అక్కరలేదని తీర్మానము చేశారు ఆనాడు, కాంగ్రెసు శాసనసభ్యులు హాజరై యున్నారు ముఖ్య మంత్రి సంజీవరెడ్డిగారు కూడ కాంగ్రెసు సంఘమునకు అధ్యక్షులుగా ఉండి యున్నారు శ్రీయుత యం వి కృష్ణారావుగారు, శాసన సభ్యుడుగా ఉండి, ఎగువ సభ అవసరమని, ఒక తీర్మానమును సభలో ప్రవేశపెట్టగా దానిని మన ఆంధ్రరాష్ట్ర శాసనసభ్యులు అందరు ఏకగ్రీవముగా, మనకు ఎగువసభ అవసరము లేదు అని, ఆ తీర్మానమును వ్యతిరేకించారు, అంతటితో ఆ తీర్మానము వీగి పోయింది ఆ విధముగా తీర్మానించడములో అది ఒక సూత్రముపైన వ్యతిరేకించారని అనుకుంటున్నాను శాసన సభ్యుల అభిప్రాయములో ప్రజలచే సూటిగా ఎన్నుకోబడిన వ్యక్తులు ప్రజల విశ్వాసమును పొందిన వారు గనుక, వారు తప్ప మరొకరు ఇలాంటి సభలో ఉండరాదన్న అభిప్రాయము కనబడింది అందువల్ల మరొకరు, ప్రజలయొక్క విశ్వాసము లేనివారు అక్కరలేదని తేలిపోయింది అలాంటి ఉద్దేశ్యముతోనే ఆనాటి కాంగ్రెసు సభ్యులు ఆ తీర్మానమును వ్యతిరేకించి, ఎగువసభ అక్కరలేదని తీర్మానించారు అలాంటి కాంగ్రెసు నాయకులు కూడ ఈ శాసనసభలో కూర్చొని ఉండి, యీనాడు ఎగువసభ కావలెనని తీర్మానము తేవడము శోచనీయము, అర్థరహితము ఆనాటి కాంగ్రెసు సభకు అధ్యక్షులుగా వున్నవారు, ఆ తీర్మానమును వ్యతిరేకించినవారు అయిన శ్రీ సంజీవరెడ్డిగారు, ఈనాడు ముఖ్యమంత్రి పదవిలో వుండి, ఎగువసభ కావలెనని తీర్మానము ఎందువల్ల తెచ్చారో అర్థము కావడములేదు వారికి ఈనాడు ఇలాంటి అభిప్రాయము కలగడము శోచనీయముగా వున్నది ఆ రోజులలో ఆంధ్రరాష్ట్రమునకు ఎగువ సభను ఏర్పాటు చేసుకోలేదు ఇక్కడ హైదరాబాదులో కూడ లేదు ఇప్పుడు దీని అవసరము ఎందువల్ల కలిగిందో తెలియడములేదు ఈనాడు ఎగువసభ అవసరము అని చెప్పేవారు ఆనాడు ఎందువల్ల వ్యతిరేకించారో తెలియజేయవలసి యున్నది మనకు ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పటినుంచి మనము కొన్ని traditions ను build up చేసుకున్నాము ఆంధ్రరాష్ట్రము వారికిగాని, హైదరాబాదు రాష్ట్రమువారికిగాని ఎగువసభతో నిమిత్తము లేకుండాపనులు సక్రమంగా కొన్ని traditions కు లోబడి జరుపుకుంటూ రావడము జరిగింది కాని ఈనాడు ఎగువసభ అవసరము ఏమి వచ్చింది ? అలాంటి traditions ను యీనాడు break చేసి, రాష్ట్ర సాంప్రదాయములను ఉల్లంఘించి, ఎగువసభ అవసరమని కాంగ్రెసు నాయకులు, ముఖ్యమంత్రి అయిన సంజీవరెడ్డిగారు ఎందువల్ల చెబుతున్నారో నాకు అర్థము కావడములేదు ఇది నాకు కొంత ఆశ్చర్యమును కలుగజేస్తున్నది పోతే

ఇతర దేశములలో అనగా, అమెరికా, రష్యా, బ్రిటను దేశాలలో ఎగువ సభలు ఉన్నవని అన్నార ఆ దేశములలో, అక్కడి సాంప్రదాయములను బట్టి, అక్కడి వారికి అవసరమైతే కావచ్చు మన శంకరయ్యగారు చెప్పినట్లు దేశము మొత్తము మీద Senates ఉండవచ్చు అమెరికాలో గాని, రష్యాలో గాని, తదితర దేశాలలోగాని ఎగువసభలు వున్నవి కాని అక్కడ రాష్ట్రములలో ఎగువ సభు అవసరము వారు గుర్తించినట్లు లేదు మన దేశములో కూడ చాలా రాష్ట్రములలో కాంగ్రెస ప్రభుత్వము ఏర్పడిన తర్వాత Legislative Councils పెట్టుతున్నారు గాని వారి ఉద్దేశ్యముతో నేను ఏకీభవించలేను ఒక వేళ ఉంటే ఆయా రాష్ట్రముల సాంప్రదాయములను బట్టి ఏర్పాటు చేసుకుని ఉంటే ఉండవచ్చు కాని మనము వార్లను అనుసరించాల్సిన అవసరము లేదనుకుంటాను ఏమైనప్పటికినీ యీ సూత్రమును నేను వ్యతిరేకించను ఎందుకంటే అది పూర్తిగా వ్యతిరేకించటానికి వీలు కాదు ఈ principle కొంతవరకు మంచిది అయితే కావచ్చు Abstract principle తో కొంతవరకు మనము ఏకీభవించవచ్చు గాని, ఈ సభలకు concrete shape యిచ్చేటప్పటికి, అవి ఏ రూపములో వుండగలవో నాకుమాత్రము సందేహము కలుగు తున్నది ఆ విధానముపైన, concrete shape పైన, ప్రతివారికి కూడ చాలా భేదాభిప్రాయాలు వచ్చినవి ఇప్పుడు ఈ Legislative Councils లో Sectional Representation యిచ్చారంటే, గ్రామములలో వున్న peasants కు గాని, లేకపోతే పట్టణములలో వున్న workers కు గాని, ఇంకను ఉద్యోగాలలో ఉన్న clerks వగైరా ఉద్యోగస్థులకు గాని యీ సభలో ప్రాతినిధ్యము ఇచ్చి, సభను ఏర్పాటు చేయడమో, యూనివర్సిటీలో ఉన్న గొప్ప గొప్ప మేధావంతులను యీ సభకు మెంబర్లుగా నామినేటు చేసి తీసుకొని రావడమో, యిలాంటి సాంప్రదాయములను అనుసరించినట్లయితే అప్పుడు అవి కొంతవరకు ఉపయోగపడుతాయేమో గాని, మరొక విధంగా యితరులను, కాంగ్రెస్ పార్టీ యొక్క purposes కు వ-యువారిని నామినేటు చేయడము సమంజసమని నేను అనుకోను కేవలము మేధావంతులనే నామినేటు చేయడమనే principle తో నేను ఏకీభవించవచ్చు కాని అదే విధముగా సక్రమ మార్గముతో జరుగుతుందా అనేది సందేహము కలుగుతున్నది ఈనాడు మన దేశములో ఏర్పరచ బడిన Legislative Councils లోగాని, Council of States లో గాని జరిగేది మరొక విధముగానే జరుగుచున్నది ఈనాడు ఆ సభలలో మెంబర్లుగా ఏర్పరచబడినవారు, వారి వారి పార్టీలకు సంబంధించినవారు గానే కనబడుతున్నారు గాని, అసలు చెప్పే principle వేరు, జరిగేవిధానము వేరుగా కనబడుచున్నది దీనిని ఎవరూ కాదనలేరు ఏ సభలోచూచినా, వారి వారి party politics కొరకు గవర్నరుగారిచేత నామినేటు చేయించి తెస్తున్నారు వారి అంతర్య రాజకీయముల కనుగుణముగా వారికి అవసరమైన వ్యక్తులను గవర్నరుచేత నామినేటు చేయించడమో లేకపోతే యం ఎల్ ఏ లను ప్రోత్సాహపరచి elect చేయించడమో జరుగుచున్నదీ ఈ వ్యక్తులు ప్రజలకుపయోగ పడేవారు కాకుండా పోతున్నారు వారి party purposes కు ఉపయోగిస్తున్నారు ఇదంతా

పరిశీలించి చూస్తే, వాస్తవ పరిస్థితులు తేటతెల్లమగుతవి ఉదాహరణకు మనము composite Madras State లో ఉండగా శ్రీ రాజగోపాలాచారి గారిని గవర్నరుచేత కౌన్సిలుసభ్యుడుగా నామినేటు చేయించి, మద్రాసు ముఖ్యమంత్రిగా తీసుకుని వచ్చారు ఇది ఆనాటి కాంగ్రెసు పార్టీ కొరకు జరిగిన సంగతిఅని అందరకూ తెలును కాని రాజాగోపాలాచారిగారు మేధాశక్తిగల వ్యక్తి కాదని చెప్పటానికిసాధ్యము కాదు అయినప్పటికినీ కాంగ్రెసుపార్టీ నిలబెట్టుకోటానికి చేసిన పని అది పూర్వము బ్రిటిష్‌వారు వచ్చిన తరువాతనే మనదేశములో యీ Legislative Councils ఏర్పాటు చేయబడినవి వారు ఏ ప్రాతిపదికపైన యీ కౌన్సిల్సును ఏర్పాటు చేశారో గుర్తించాలి ఆనాడు కౌన్సిల్సుకు మెంబర్లను ఎన్నుకోవలసి వస్తే, యీ మెంబర్ల ఎన్నిక Land Assessment మీద base చేసి ఎన్నికలు జరిపారు వ రాడు వందలు Land Revenue కట్టేవారికే ఓటింగుకు హక్కు ఇచ్చారు ఇక Council of States కు మెంబర్లను ఎన్నుకోవలసి వస్తే Land Revenue అంతకంటే ఎక్కువగా చెల్లించే వారికే ఓటింగు హక్కు ఇచ్చారు ఇందులో వున్న ఆంతర్య రహస్యము గ్రహించినట్లయితే, బ్రిటిషువారు దేశములో Land properties గల వ్యక్తులను తమ vested interests ను protect చేయటానికి వారు ఆ విధమైన పద్ధతిని అవలంబించారు అసలు అప్పటికే విప్లవ అభిప్రాయాలు ప్రజలలో ఆరంభమైనందువల్ల మనకు స్వాతంత్ర్యము కావాలని ఒక ఉద్యమము బయలుదేరి, అది క్రమేణా బలపడింది ఏనాటికి స్వాతంత్ర్యము వస్తుందా యెప్పుడు కాంగ్రెసు ద్వారా ప్రజా ప్రభుత్వము వస్తుందా, అని ప్రజలు నిరీక్షించారు ఆనాడు పూర్తిగా దేశములోని vested interests బ్రిటిషువారిమీదనే ఆధారపడి, వారిని అనుసరిస్తూ వచ్చారు గనుక, వారికి Councils ఏర్పాటు చేశారు కాని యీనాడు ప్రజాపరిపాలన వచ్చింది అది వచ్చినప్పటినుంచి ప్రజా ప్రతినిధులు ప్రభుత్వములో అధికార మంతా మనదేనని అనుకునేవారు వచ్చిన తరువాత ఈ సభలు వుండవలసిన అవసరము కన్పించదు ఆనాడు ఆంధ్రరాష్ట్రమునకు, హైదరాబాదు రాష్ట్రమునకు ఈ ఎగువసభ అక్కరలేదు అన్నారు ఆ విధంగా కాంగ్రెసు నాయకులే తీర్మానము చేసినప్పుడు, యీనాడూ మరల యీ సభ అవసరమని ఎందుకు చెబుతున్నారో అర్థము కావడములేదు మన ముఖ్యమంత్రిగారు యితర దేశాలను గురించి, అక్కడ ఎగువసభలను గురించి చెప్పారు అమెరికాలో వున్నవని అంటే, అక్కడ Senates ఉన్నవి కాని అక్కడ వున్న ఎగువసభలకు, Senates కు ఇక్కడవున్న ఎగువ సభలకు చాలా భేదము ఉన్నది అక్కడఉన్న Senates యిక్కడ ఉన్న Legislative Councils వాటి మాదిరి కావు అక్కడ సెనేటుకు చాలా అధికారాలు వున్నవి, హక్కులుకూడ వున్నవి అసలు వారియొక్క బాధ్యతలే వేరు వారికి వున్న హక్కులు వేరు అక్కడ వున్న Senate, executive లో ఒక భాగముగా వున్నది, ప్రభుత్వంలో ఒక భాగముగానే వున్నది కాని అటువంటి అధికారాలు యిక్కడ లేవు ఇక్కడ మనకు

వున్న ఎగువసభకు ఎంతవరకు అధికారమున్నదో గమనించండి Legislative Assembly వారు pass చేసిన శాసనములను ఎగువ సభవారు అంగీకరించక పోతే, ఆ శాసనములను పున పరిశీలించమని త్రిప్పి గొట్టటము, అందుమీదట మరొకసారి ఎసెంబ్లీవారు చర్చించి తిరిగి పంపడముజరుగుచున్నది ఇలాంటి హక్కు కౌన్సిలుకు యిచ్చారు ఇలాంటి అవకాశము, అధికారము కౌన్సిలుకు ఉన్నదే కానిమరొక అధికారము లేదూ అంతకంటె ఈఎగువసభ చేయగలిగింది ఏమీ లేదు కాని యితర దేశాలలో ఒట్లు కాదు అక్కడ దిగువ ఎగువశాసనసభకు ఎక్కువ హక్కులు కలవు కాబట్టి ఆ దేశములలో ఆ సభలు ఉపయోగ పడుతున్నవే గాని, ఇక్కడ మనరాష్ట్ర పరిస్థితులను బట్టి, ఇక్కడ ఎగువ సభకు అలాంటి అవ సరము లేదు

Senate కు House of Representatives కంటె ఎక్కువ హక్కులున్నాయి ఫ్రాన్సు—మున్నగు ఇతర దేశాలలో కూడా Senates ఉన్నాయి Senates న్ను ఏర్పరచే రోజులలో ఆదేశాలలో కూడ అనేక వాగ్వివాదాలు జరిగాయి Senate ఉండడానికి వీలు లేదు, దాని వల్ల అనేక ప్రమాదాలున్నా యని చాలా మంది వాదించారు కాని క్రమేణా Senate ఏర్పడింది కాని Senate చాలా complicated structure నుకలిగియున్నది మన దేశంలో ఉండే Councils కు వారి Senates కు అసలు సంబంధమేం లేకుండా ఉన్నది ఇతర దేశాలలోని అనుభవాలను తీసుకొచ్చి పెద్ద arguments చేసి దానిని సమర్ధించడానికి ప్రయత్నం చేస్తే సమజసంగాదని తెలియ జేస్తున్నాను ఆరోజుల్లో ఫ్రాన్స్‌లో Senate వుండవలెనా, అక్కర లేదా అనేవిషయమై జరిగిన చర్చలలో వారు తెలియజేసిన అభిప్రాయలు కొన్ని ఉన్నాయి వాటిని గురించి క్లుప్తముగా యిచట చదవదలచు కున్నాను '

" In France, the theory of revolution against inequalities of all sorts and the burning reckless people in popular sovereignty, overcame both the wishes of some of the cashiers and the theories of De Holme and Montesquieu which suggested a bicameral system of Commons and Lords The ideology of Rousseau was accepted as a true description of the facts of the time

But the sovereign is one and simple because it is the collection of all without the exception of even one person , therefore the legislative power is one and simple, the sovereign cannot be divided because there are not two or three legislative powers and vice versa, and consequently if you divide the legislative power in two or three parts, you divide the sovereign into two or three, a thing which is not possible for men to do because they cannot contrive that the sovereign which is necessarily the collection of all in one shall be other than the collection of all in one "

ఇది రూసో చెప్పిన సిద్ధాంతం,

ఆర్థికమంత్రి (శ్రీ కె వెంకటార్వు) —ఆ సిద్ధాంతాలు వేరు

శ్రీ బి రత్న సభాపతి —అధ్యక్షా! కర్నూలులో వెంకటరావుగారు చేస్తూండే interruptions అధ్యక్షులు వారికి తెలుసు ఇప్పుడు మా అదృష్టంకొద్దీ శ్రీ వెంకటార్వుగారు మాకు కొంచెం దూరంగా ఉండడంవలన కొంత బాధ తప్పిపోయింది కాని అధ్యక్షులవారు మమ్ములను protect చేయకపోతే మేము అసలు మాట్లాడడానికి అవకాశం ఉండదు

మిస్టర్ స్పీకర్ —బాగానే వున్నది, కాని మీరు చెప్పినది సరికాదన్నారు దానిని గురించి సరిగా మాట్లాడండి

శ్రీ యం సత్యనారాయణరాజు (పిపురుపల్లి—జనరల్) —అధ్యక్షులవారి permission తీసుకొని, objection చెప్పాలి కాని permission లేకుండా చెప్ప కూడదని మనవి చేస్తున్నాము

శ్రీ కె వెంకటార్వు —మధ్యలో interupt చేయడం member యొక్క హక్కు దానికి అధ్యక్షులవారి permission అక్కర లేదు అన్ని శాసనసభల్లోనూ ఇది జరుగుతూ ఉంటుంది

శ్రీ ఎం సత్యనారాయణరాజు — ఏదిచేసినా అధ్యక్షులవారి permission తో జరగాలి

శ్రీ కె వెంకటార్వు — అక్కరలేదు

మిసర్ స్పీకర్ —దానికి కూడా కొంచెం మితం ఉండాలి హక్కు ఉన్నదికదా యని మధ్యమధ్య మాట్లాడితే చిక్కులువస్తాయి కాబట్టి కొంచెం జాగ్రత్తగా ఉంటేనే మంచిది

(Laughter)

శ్రీ బి రత్న సభాపతి —శ్రీ వెంకటరావుగారు చెప్పినట్లుగా Constitut on ను amend చేస్తున్నామా అనే ప్రశ కు సమాధానం చెప్పటకుగాను రూసోగారి political theory ని గురించి చదివినాను ఆ రోజులలో (Senates) ఎగువ సభలు అనేవి చాలా ప్రమాద కరమైన వాదనలకుఅవకాశం కలిగించాయని పెద్దపెద్ద రాజకీయ సూత్రకారులు చెప్పారు ఇప్పటికీ ఆ వాదన ఉన్నది వెంకటరావుగారివంటి పెద్దలు, రాజకీయ మేధావంతులు వారి అవసరాల నిమిత్తం ఇటువంటి వన్నీ తీసుకు వసూ ంటారు కనుక ఉపయోగకరమైన సిద్ధాంతాలకు అవకాశం లేకుండా కౌన్సిల్స్‌పెట్టే అవకాశంకూడా కల్గింది ఫ్రాన్సులో విప్లవం వచ్చిన తరువాత చట్టాలు చేసేందుకు సంపూర్ణమైన అధికారం ఎవరిచేతిలో ఉండాలి అనే విషయమై వాగ్వివాదం వచ్చినది అట్టి అధికారం విప్లవకారకులైన ప్రజల చేతుల్లో ఉండాలా, ప్రజాప్రతినిధుల చేతుల్లో ఉండాలా, లేక విప్లవాలను చెడకొట్టే కొంత మందికి అట్టి అధికారం ఉండాలా అనే సమస్యవచ్చినది అప్పట్లో Senate ఉండ

డానికి వీలులేదని వాళ్లు తీర్మానించారు తరువాత ఆ కొన్ని సంవత్సరాలకు Senate వచ్చిందనుకోండి ప్రజలచేఎన్నుకోబడిన ప్రతినిధులకే అధికారం ఉన్నది, ఇతరులెవ్వరికీ అట్టిఅధికారాలు లేవని తెలియజేశారు ఈ విషయాన్ని తెలియ జేయడానికే నేను రూసో గారు చెప్పినదానిని quote చేశాను మళ్లీ ఫ్రాన్సులో Senate అవసరం లేదనే చర్చలు వచ్చినప్పుడు సాయజ్ అనే పెద్ద రచయిత, రాజకీయ సూత్రకారుడు ఇంకొక అభిప్రాయాన్ని తెలియజేశారు

"If the assemblies agree, the second chamber is unnecessary If they disagree, it is obnoxious"

రెండు సభలూ ఒక విధమైన అభిప్రాయాలను కలిగి వుంటే రెండవ సభ అనవసరం భేదాభిప్రాయాలను కలిగి వుంటే అంతకంటే హీనమైన పరిస్థితి ఇంకొకటి లేదని చెప్పారు అటువంటి పరిస్థితి ఏర్పడడానికి అవకాశం ఉంది కనుకనే పెద్ద పెద్ద రచయితలు, మేధావులు political thinkers మొందటినుంచీ second chamber అనేది అనవసరమనీ, దానివల్ల చాలా ప్రమాదాలున్నాయనీ చెప్తున్నారు ఆ రోజుల్లో మనకున్న సాంఘిక వ్యవస్థ అయితేనేమి, రాజకీయ, ఆర్థిక వ్యవస్థలైతేనేమి బూజుపట్టిన వ్యవస్థగా ఉన్నాయి తొమ్మిది సంవత్సరములనుంచీ మనం ప్రయత్నం చేసు న్నప్పటికీ పరిణామాలను తీసుకువచ్చే స్థితిలో లేము ఇందుకు చాలా కారణాలున్నాయి

Land reforms, మిగతా ఇతర విషయాలలోనూ అవసరమైన మార్పులను చేసుకొని త్వరగా చట్టాలు చేసుకోడానికి అవకాశాలుండాలి కాని చట్టాలు చేయడంలో ఆలస్యం జరగకూడదని అభిప్రాయ పడుతున్నాను కౌన్సిలు ఏర్పడినదంటే అసెంబ్లీలో మనం చర్చించి తీర్మానం చేసినది కౌన్సిలులోకి పోతుంది దానిమీద మళ్ళీ కౌన్సిల్‌లో చర్చ జరగాలి అక్కడ మళ్ళా తీర్మానం చేసినతరువాత అమలు చేయడానికి అవకాశం వుంటుంది కాబట్టి ఇది ఆలస్యానికి దారితీస్తుంది మన Constitution ప్రకారం, States Reorganisation Bill లో కనపరచిన దాని ప్రకారం, District Board Members చేత ఎన్నుకోబడినవారు కొంతమంది, యం ఎల్ ఏలు చేత ఎన్నుకోబడినవారు కొంతమంది అందులో వుంటారు ఈ విషయమై మిత్రులు చాలా మంది చెప్పారు దానిని గురించి నేను ఇప్పుడు చెప్పదలచుకోలేదు కాని దానిని బట్టి ప్రజలచేత ఎన్నుకోబడినవారు అనిపించుకోడానికి District Board Members తప్ప, ఇంక యెవ్వరూ లేరు

వీరిలోకూడ ఎటువంటివారు వుంటారో తెలియదు ఇది కేవలం రాజకీయావసరాలను పార్టీ బలాలనుబట్టి ఏర్పడుతోంది ఇక్కడ వున్నట్లుగా వీరికి సమానమైనట్టి వారే కౌన్సిలులో కూడ వుంటారు ఈ రోజున అసెంబ్లీలో ఎటువంటి ప్రాతినిధ్యం వున్నదో ఆ మాదిరిగానే కౌన్సిలులో వుంటుంది కాని, sectional interests తో ఒక peasant కు గాని, clerk కు గాని, worker కు

గాని ప్రాతినిధ్యం యిచ్చి sectional interests ను represent చేసుకోడానికి ఏమాత్రం అవకాశం కనిపించదు కనుక యిటువంటి పరిస్థితులలో కౌన్సిలు యొక్క ప్రత్యేక ప్రయోజనం ఏమి వుంటుందో నాకు అర్థం కావడంలేదు ఇంత తొందరగా resolution ను pass చేయవలసిన అవసరం కనిపించుట లేదని ముఖ్యమంత్రి గారికి మనవి చేస్తున్నాను మన ప్రదేశంలో పార్లమెంటుకు elections జరగబో తున్నాయి తెలంగాణా ప్రాంతంలో అసెంబ్లీకి కూడ ఎన్నికలు జరుగబోతున్నాయి ప్రజలను కూడా ఈ విషయం అడగవచ్చు Elections లో ఒక mandate గా పెట్టుకొని ప్రచారం చేయవచ్చు రాబోయే కొత్త సభ్యుల అభిప్రాయాలను కూడా తెలుసుకొని, అవసర మైతే కౌన్సిలును ఏర్పాటు చేసుకోవచ్చు ఇప్పట్లో ఈ తీర్మానాన్ని ఉపసంహరించుకోవలసినదిగా కోరుతున్నాను

శ్రీ టి వి రాఘవులు (కొవ్వూరు-రిజర్వుడు) అధ్యక్షా, నేను నిన్ననే పేరువ్రాసి ఇచ్చాను ఇంతవరకూ అవకాశంరాలేదు

మిస్టర్ స్పీకర్ — వరుసగా వస్తుందండి

*శ్రీ జి హనుమంతరావు —(ములుగ్) — అధ్యక్షా, ఎగువ సభ విషయంలో యిప్పుడొక తీర్మానం మనముందుకు వచ్చింది ముఖ్యంగా యీ ఎగువ సభ ఎందుకు కావలెనో ఎందుకు అవసరమో అనేటటువంటి దానిని గురించి కొంతమంది గౌరవసభ్యులు చెప్పారు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలుపరచాలంటే, దానిని మనం ముందుకు తీసుకొని పోవాలంటే యీ ఎగువ సభ చాలా అవసరమని వారు చెప్పిన దాని సారాంశం ఈ ఎగువ సభ వివిధ వర్గముం లకు ప్రాతినిధ్యం వహించేటట్లుగా చేయాలని, పట్టభద్రులు దానిలోవుండాలని, ఛాంబరు ఆఫ్ కామర్సువారు కూడ దానిలో వుండాలనీ, యీ విధంగా వివిధ వర్గములు కూడుకొని ఉన్నటువంటి ఎగువ సభను సృష్టించడం చాలా ముఖ్యమని వాదించారు ముఖ్యముగా నాకు విచారం కల్గిస్తున్న విషయం ఒకటుంది ప్రస్తుతం మనముందు చాలా ప్రధానమైన సమస్యలు వున్నాయి, క్లిష్టమైన సమస్యలు వున్నాయి ధరలుపెరుగుదలను మనం చూస్తూనే యున్నాం ఆ విషయమై అడ్జర్న్ మెంటు తీర్మానమును ప్రతిపాదించడం కూడ జరిగింది ఆంధ్రరాష్ట్రం, హైదరాబాదు లోని తెలుగు భాగాలు కలిసిన తరువాత ఉత్పన్నమైన అనేక అపరిష్కృత సమస్యలున్నాయి కాని, ఆ సమస్యల నన్నిటిని వెనుకకు నెట్టి, యీ ఎగువ సభ విషయమును ప్రధాన సమస్యగా మనముందుకు తీసుకొనిరావడం నాకు చాలా విచారముకల్గిస్తున్నది అంటే ఇదివరలో జరిగినట్లుగానే యిప్పుడుకూడా ప్రధాన సమస్యలనన్నిటిని వెనుకకు నెట్టివేసి, తమలో వున్నటు వంటి గ్రూపులను తమలో వున్నట్టి చీలికలను తమలో ఎవరెవరైతే ఎదిరిస్తున్నారో, వారిని సరిదిద్దుకునే నిమిత్తం చేసుకొన్నటువంటి ఏర్పాటు మాత్రమే యీ ఎగువ సభ ఇంత తొందరలో మన ముందుకు యీ తీర్మానమును తీసుకువచ్చి ఏదో ఒక విధంగా దానిని నెగ్గించుకొని తమ గ్రూపు సమస్యలను తీర్చుకోడానికి గాను యీ తీర్మానమును తీసుకొనివచ్చినట్లుగా మేమంతా భావిస్తున్నాము ఈ లెజిస్లేటివ్ కౌన్సిల్ విషయమై మాకు గూడ కొంత తెలుసు వెనుకటి రోజులలో మేముగూడ కాంగ్రెసులో వుండిన వాళ్ళమే నేను గూడ ఆ కాలములో కాంగ్రెసు వాడినే పి డి ఎఫ్ సభ్యులు గాని, కమ్యూనిస్టు సభ్యులుగాని, స్వతంత్ర సభ్యులుగాని, సోషలిస్టులుగాని, అంతా ఒకప్పుడు యిప్పటి కాంగ్రెసువారితో కలిసి యీ ఎగువ సభలు వుండ

కూడదని ఎగువ సభలు నష్టదాయకమని పదేపదే వొక్కి చెప్పాము, ఎదిరించాము కూడా ఆ విషయములన్నిటినీ మరచిపోయి నేడు తమకు మెజారిటీవున్నదని, నేడు ప్రభుత్వ పక్షములో చీలికలున్నాయని, నేడు కాంగ్రెసులో వివిధ వర్గములను కలుపుకొనుటకు గాను యీ అవకాశమును ఉపయోగించుకొంటున్నారు అందుకే ఎగువ సభ విషయము తీసుకొనివచ్చి, ప్రజలు అంగీకరించినా అంగీకరించకపోయినా మెజారిటీ వున్నదని దానిని దేశంపై రుద్దడం, యీదినం మామందుకు ఆ తీర్మానమును పాస్ చేయించుటకుగాను, తీసుకొనిగావడం సరియైన పద్ధతిగాదని నామట్టుకు నేను అనుకొంటున్నాను ఈ ఎగువసభ ఎందుకు అనే విషయం వచ్చినప్పుడు మనం, యిక్కడకు ఎన్నికలద్వారా వచ్చినవాళ్ళమంతా తెలివైనవాళ్ళము కాము,—కుర్రవాళ్ళు వచ్చారు ఏదో వోట్లద్వారా కొంత చదువుకొన్నవాళ్ళు వచ్చారు, చదువురానివాళ్ళుకూడా వచ్చారు కాబట్టి, మనకన్నా చదువుకొన్నవాళ్ళు మంచి మేధావులు, మేధా సంపన్నులువున్నటువంటి ఎగువసభ అవసరం అనేటటువంటి విధంగా యీ తీర్మానం సమర్థించబడింది నాకీ విషయం చాలా విచారాన్ని కల్గిస్తున్నది నేడు మనలో కూర్చొన్నవారిలో మేధావులు వున్నారు, కవులు వున్నారు, పట్టభద్రులు వున్నారు, వ్యవసాయము చేసేవారున్నారు, వ్యాపారము చేసే వారున్నారు, వివిధ రంగములలో పనిచేసేవారున్నారు, వారందరూ తెలివిలేని వారని చెప్పడం ఎగువసభలోనికి చాలా తెలివైన వారు వస్తారని చెప్పడం చాలా హాస్యాస్పదం మనం యే వోటర్ల ప్రతినిధులుగా యిక్కడకు వచ్చామో ఆ ఓటర్లకు "మీరు తెలివైనవారిని ఎన్ను కోలేదు, మీరు ఏదో అకస్మాత్తుగా కొంతమందిని యీసభకు పంపించారు, అది సరియైనదిగాదు" అని చెప్పడమేనని అనుకొంటున్నాను యిది మనకు సిగ్గుచేటు అని కూడ నేను భావిస్తున్నాను ఈ ఎగువ సభ ఎందుకు అనే సమస్య వచ్చినప్పుడు ఎట్టి వాదన వస్తున్నదో మనం చూస్తూనే వున్నాం మనం యిచ్చట చేస్తున్న శాసనములు ఏ విధంగా తయారు చేయబడుతున్నవో గమనించవలసియున్నది ఆ యా ప్రభుత్వ శాఖలలో వున్న న్యాయశాస్త్ర ప్రవీణులు ఆ యా శాఖల అధిపతులు కలిసి కూర్చొని వివిధ విషయములను సమగ్రంగా చర్చించి, ముసాయిదాలు తయారు చేస్తారు తరువాత పెద్దపెద్ద లాయర్లు కలిగినటువంటి న్యాయశాఖవున్నది ఆ న్యాయశాఖలో ముసాయిదాలను కూలంకషంగా పరిశీలిస్తారు తరువాత కేబినెట్—దేనినైతే మనం మనదేశమును పరిపాలిస్తున్నటువంటి మంత్రివర్గం అనుకుంటున్నామో, ఆ కేబినెట్‌లో మంత్రులందరూ కూర్చొని, యీ ముసాయిదాలను చర్చిస్తారు తరువాత బిల్లులు శాసనసభలో ప్రవేశపెట్టడం జరుగుతుంది శాసనసభలో యింతమంది కూర్చొని చర్చించిన మీదటకూడ ఒక్కొక్కప్పుడు చాలా ముఖ్యమైనదైనట్లయితే అట్టి బిల్లులను సెలక్టు కమిటీలకు కూడా పంపుతారు సెలక్టు కమిటీలో సభ్యులు వాటిని దీర్ఘంగా చర్చిస్తారు

శ్రీ కట్కా రామిరెడ్డి (నల్లగొండ—జనరల్) —అధ్యక్షా, ఒక పాయింట్ ఆఫ్ ఆర్డర్, ముఖ్యమంత్రిగారు యిప్పుడు సభలో లేరు మేము చెప్పే విషయములకన్నిటికీ వారు తరువాత సమాధానం చెప్పడం కష్టముగా వుంటుంది కాబట్టి వారిని, యిప్పుడు హాజరు పెట్టాలని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ —మంత్రివర్గములోని తక్కినవారు కొందరు సభలో వున్నారు

శ్రీ జీ హనుమంతరావు :—సెలెక్టు కమిటీవారు ఒక్కొక్కప్పుడు ముఖ్యమైన బిల్లుల విషయములో యితరుల సలహాలను తీసుకొంటూవుంటారు సాక్ష్యాలను సేకరిస్తారు కూడా రెవిన్యూ పరిపాలనకు టెనెన్సీ శాసనమునకు మనము వివిధ వర్గముల వారినుంచి సాక్ష్యము సేకరించిన విషయం, తరువాత సెలెక్టు కమిటీలో కూర్చొని, సెలెక్టు కమిటీ వారు అన్ని విషయములను సాకల్యంగా, సమగ్రంగా పరిశీలించి, వారి అభిప్రాయములను పొందు పరచి యీ సభకు బిల్లులను పంపిన సంగతి మనకందరికీ తెలుసును ఎప్పుడైతే ప్రధానమైన సమస్య వస్తుందో అప్పుడు ఆ సమస్యను చర్చించడానికి సమస్య సరిగా వున్నదా, లేదా అని పరిశీలించడానికి మనకు అవకాశం వుంది వివిధ వర్గములవారిని పిలిచి, అట్టి సమస్యలు చర్చించడానికి మనకు వీలుంది చాలామంది ఆమోదించిన తరువాతనే మనం బిల్లులను అసెంబ్లీకి తీసుకొని వస్తున్నాము అసెంబ్లీలో కూర్చొని, మనమంతా ఆలోచన చేసి, వాటిని ఆమోదిసున్నాం అట్టి బిల్లులను మనము ఆమోదించిన తర్వాత ఎగువసభకు పంపించాలి, అక్కడ మేధావులు వున్నారు, యీ పనిని ఆ మేధావులకే అప్పగించి, మనం తరువాతనే తిరిగి వాటిని పాస్ చేద్దామని చెప్పడం చాలా హాస్యాస్పదం అది మనలను మనమే కించపరచుకొన్నట్లు అవుతుందేమోనని భావిస్తున్నాను

ఇక ఖర్చు విషయం చూచినట్లయితే, ౮, ౫ లక్షల రూ ల వరకు వ్యయం అవుతుందనుకుంటున్నాను ఇప్పుడు మనముందు వున్న సమస్యలనన్నిటినీ వదులుకొని, అనవసరంగా యీ ౮, ౫ లక్షల రూ లు ఖర్చు చేయడం భావ్యంగాదు హైదరాబాదు నగరం ఆంధ్ర ప్రదేశ్ రాజధానిగా అయిన తరువాత నగరంలో నీటికొరకు, ఎలక్ట్రిసిటీకొరకు, యిండ్లకొరకు, ప్రజలు చాలా బాధలు పడుతున్నారు కొన్ని ప్రాంతములలో—మీకు ఆశ్చర్యము కలుగవచ్చు,—రోజుకు ఒక్క నిముషముగూడ నీరు రాదు బావులు త్రవ్వడానికి వీలులేదు యీ విషయంలో ఎన్నో మెమొరాండంలు యిదివరలో యివ్వబడినవి గాని, వాటిని గురించి యింతవరకు ఆలోచించలేదు దేవలూరు ప్రాజెక్టు కడతామన్నారు, గాని అదికూడ యీ విభజన సమస్య వచ్చిన తరువాత యించుమించు అడుగంటిపోవడినట్లు నాకు తెలుస్తూయున్నది హైదరాబాదు నగరంలోని ప్రజలు యిదివరకు కంటే యించుమించు ౧౫౦ వేలు పెరిగారు ఇదివరకే నీరులేక వారు కష్టాలు పడుతున్నారు, వారితో బాటు ఈ ౧౫౦ వేలమంది కూడా చాలా బాధలుపడుతున్నారు అన్నిటికన్నా ముఖ్యమైన ఇండ్ల సమస్య వున్నది, ఇండ్లులేకుండా చాలామంది అల్లాడిపోతున్నారు అట్టి సమస్యనుగూడ యీనాడు వెనుకకు నెట్టివేస్తున్నారు ముఖ్యమైన సమస్యలను వెనుకకు నెట్టి, యీ ఎగువశాసనసభ విషయం యింత తొందరగా యింత ఆదుర్దాతో వెంటనే జరపాలని లేకపోతే బ్రహ్మాండం మునిగిపోతుందనీ, మనం ముందు పని చేయడానికి వీలు లేదని మనకు ముందుగతులు లేవని చెప్పడం సరియైనదిగాదని నేను భావిస్తూ, యీ తీర్మానమును ఉపసంహరించుకొనవలసినదని ప్రభుత్వమువారిని మనఃపూర్వకముగా కోరుతున్నాను కనీసం యీ విషయాన్ని ఎన్నికలు అయేటంతవరకైనా ఆపు చేయడం మంచిది ఎన్నికలైన తరువాత నూతన శాసనసభ్యులంతా వస్తారు, కనుక వారికి యీ విషయమై ఆలోచించడానికి అవకాశం యివ్వండి అయితే మరల యిట్టి తీర్మానమును తెచ్చుట అవసరము లేదని నా అభిప్రాయము కనీసం ఎన్నికలు అయేటంతవరకైనా యీతీర్మానమును వాయిదా వేయాలని దీనిని వెంటనే వాపసు తీసుకోవాలని నేను కోరుతున్నాను

*శ్రీ యత్ లక్ష్మణదాస్ (పాతపట్నం—జనరల్) —అధ్యక్షా, ఈ వేళ మనముందు ఉన్న ఈ తీర్మానాన్ని నేను హృదయపూర్వకంగా బలపరచడమే కాకుండా, తోటి శాసన సభ్యులందరూ కూడా దీని ప్రాముఖ్యతను గమనించి, ఈ తీర్మానాన్ని బలపరచవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాను ఎగువ సభ ఉండాలా అక్కరలేదా అనే విషయంలో చాలా అభిప్రాయ భేదాలు వస్తున్నప్పటికీ, ముఖ్యంగా ఒక విషయాన్ని సభ్యులు గమనించవలసి యుంటుంది ఈ ఎగువ సభకు గాను రెండు లక్షల రూపాయలు అనవసరంగా ఖర్చు పెడుతున్నారనేటటువంటి అభిప్రాయాన్ని కొంత మంది సభ్యులు వెలిబుచ్చుతున్నారు కాని, ఈ ఎగువ సభవల్ల వచ్చేటటువంటి ప్రయోజనాలను వారు గమనించినట్లు లేదు ఈ నాడు మనదేశములోనే కాదు, ప్రజాస్వామ్యం ఉన్న ఏ దేశాలలోనైన సరే చూచినట్లయితే, అనేక చోట్ల రెండు సభలు ఉండడం జరుగుతున్నది దిగువ సభలో ప్రజా ప్రాతినిధ్యం వహించిన సభ్యులు చర్చించిన తరువాత, దానిని జాగ్రత్తగా ఆలోచించడానికి కొంతమంది నిపుణులు ఉండడం మంచిదనే ఉద్దేశంతో రెండవ సభను ఏర్పాటు చేసుకొన్నారు అసలు కమ్యూనిస్టు సభ్యులు మొదటనుంచి కూడ ఇటువంటి సభలంటే వ్యతిరేకిస్తున్నారు వారు శాసన సభలు వచ్చిన తరువాత బలహీన పడిపోతున్నారని ఒక సభతోనే బలహీనపడుతున్నప్పుడు ఇంకొక సభ పెడితే, ఇంకా బలహీనపడతామనే ఉద్దేశంతో మొదటి నుంచి కూడ దీనికి వ్యతిరేకంగా ఉంటున్నారు అందుచేత కమ్యూనిస్టులకు సంబంధించినంతవరకు ఎన్ని విజ్ఞప్తులు చేసినా, ఏమిచేసినా, ఇటువంటి విషయాలలో ఈ, democratic set up ను వాళ్లు ఎన్నటికీ అంగీకరించరు అనేది చరిత్రలో కన్పిస్తున్నది కాని, ఇతర పార్టీలవారు సోషలిస్టుపార్టీవారు, తదితర సభ్యులు కూడ కొంతమంది ఈ విషయంలో దీనికి రెండు లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది గనుక ఈ ఎగువ సభ వద్దు అని చెప్పడం చాలా విచారకరమైన విషయము ఈనాడు బడ్జెట్టు, ఉపన్యాసాల లో చూస్తే, మన opposition మిత్రులు, పన్నులు వేసేటప్పుడు, పన్నులు వద్దు అంటున్నారు కాని పనులు కావాలని అంటారు ఈనాడు మనం ఎగువసభను పెట్టుకొందామంటే, దాని యొక్క విలువ ఎంతో ఉన్నదని గమనించుకోవాలని కోరుతున్నాను దేశములో, అనేక రంగాలలో, విద్యా విషయంలోగాని, వ్యవసాయము విషయంలోగాని, ఇతర రంగాలలోగాని, అనేకమంది నిపుణులు ఉన్నారు వారు ఎన్నికలలో మనవలె గెలిచివచ్చే అవకాశాలు లేవు వాళ్లయొక్క సహకారము మనకెంతో అవసరము సలహాలు కావలసివస్తే వాళ్లే ఇస్తారు వాళ్ల సలహాలు ఈ విధంగా కొనుక్కోవడ మెందుకని కొంతమంది అంటున్నారు కాని వాళ్లను గౌరవించడం అవసరం ఆ యా సమస్యలను గురించి శాసనసభలో ఇక్కడ చర్చించి, వాటి మంచి చెడ్డలను వారిద్వారా గౌరవ పూర్వకంగా తెలుసుకోవడం అవసరము దేశములో ఉన్నమూడుకోట్ల జనాభాకు సంబంధించిన విషయాలు మనము చర్చిస్తున్నప్పుడు, మన నిర్ణయాలలో ఏమైనా లోపాలుగాని, పొరపాట్లుగాని, ఉన్నట్లయితే వాటిని ఎగువ సభలో దీర్ఘంగా ఆలోచించి, సరిదిద్దడానికి అవకాశముంటుందనే ఉద్దేశంతో ఈ ఎగువ సభను ఏర్పాటు చేయాలనికోరుతున్నారు గాని, మరియే ఇతర ఆసక్తి ఇందులో లేదని మనవి చేస్తున్నాను ఇక్కడేకాదు, ఈనాడు దేశమంలోని ఇతర రాష్ట్రాలలో ఇదివరకే ఎగువ సభలు ఉన్నాయి కనుక ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం ఈనాడు క్రొత్తగా దీనిని ఏర్పాటు చేయడం అనేది కాదు దేశములో అనేకమంది మేధావులు ఉన్నారు Retire అయినటువంటి పెద్ద పెద్ద ఇంజనీర్లు మొదలగువారు ఉన్నారు వాళ్ల

యొక్క సలహాలు కూడ ఈనాడు దేశములో అవసరము ఆ విధంగా అన్ని రంగాలలో ఉన్న పెద్దలను గవర్నరు నామినేషన్ద్వారాగాని, ఇతర విధంగాగాని తీసుకోడానికి అవకాశం ఉన్నది కనుక కాంగ్రెసుకు ఈనాడు majority ఉన్నది గాబట్టి దీనిని తీసుకొని వస్తున్నారని చెప్పడం సబబుకాదు అని ప్రతి పక్షీయులకు మనవి చేస్తున్నాను కాంగ్రెసు బలములో ఉన్నది ఉంటుంది అని వాళ్లకు తెలుసు కాని, ప్రపంచములో ఈనాడు జరుగుతున్న మార్పులు గమనించి, ఎక్కడ కూడా నియంతృత్వ పరిపాలన ఈనాడు అంతమైపోతున్నదనేది గమనించి కూడ, ఈ విధంగా కమ్యూనిస్టు సభ్యులుచెప్పడం ఎందుకో అర్థం కావడం లేదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —On a point of order, Sir ఇప్పుడు మనం Legislative Council గురించి చర్చిస్తున్నాము ఈ సందర్భంలో నియంతృత్వ పరిపాలన ఎక్కడో అంతమై పోయింది అనిఏవేవో గౌరవ సభ్యలు చెప్పుతున్నారు దానికి, దీనికి, ఏమి సంబంధం లేదు ఆ విధంగా మాట్లాడినట్లయితే, వాటికి సమాధానం చెప్పుటకు మాకు అవకాశం ఇవ్వవలసి యుంటుంది అని అంటే మరల time లేదంటారు అసలు ఉన్న time చాలా తక్కువ

మిస్టర్ స్పీకర్ ——ఏవో Arguments నానా రకాలుగా చెప్పుతూ ఉంటారు మీర చెప్పేటప్పుడు "ఇళ్లు లేవు, అదిలేదు, ఇది లేదు, ప్రజలు చాలా బాధపడుతున్నారు" అని చెప్పుతారు వాళ్లు నియంతృత్వం మొదలైనవి చెప్పుతూ ఉంటారు ఇటువంటి చిన్నచిన్న విషయాలు మనస్సును బాధించ కూడదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —మనస్సును బాధిస్తుందని కాదు అసలు ఇప్పుడు అవన్నీ మాట్లాడేందుకు time లేదు Public platform మీద అయితే అటు వంటివి ఎన్ని మాట్లాడినా సరిపోతుంది కనుక నియంతృత్వం మొదలగు విషయాలు ఇక్కడ మాట్లాడడం అసందర్భం అని మనవి చేస్తున్నాను

శ్రీ యల్ లక్ష్మణదాస్ —కాంగ్రెసులో చీలికలున్నాయని చెప్పుతున్నారు అందుచేతనే ఈనాడు శాసనసభ ద్వారా ఈ విషయాన్ని గురించి తెలియజేస్తున్నాను ప్రతి పక్షంవారు "ప్రభుత్వం నూతులు త్రవ్వించలేదు, గోతులు త్రవ్వించలేదు, అది చేయలేదు, ఇది చేయలేదు, అటువంటప్పుడు ఈ రెండు లక్షల రూపాయలు ఎగువసభకు ఖర్చు పెట్ట కూడదు" అనే ఆర్థిక శాస్త్రాన్ని ఇక్కడ ఉపయోగించి ప్రజలను మభ్యపెడుతున్నారు అందుచేత నేను కూడ ఈ విషయంగురించి చెప్పవలసివచ్చింది కనుక మనము ప్రజాస్వామ్యాన్ని జాగ్రత్తగా, సక్రమంగా అమలు జరుపుకోవాలంటే, ఈ సభకు తోడుగా ఎగువ సభకూడా అవసరమనే విషయం ప్రజానీకం తెలుసుకోవాలని కోరుతున్నాను భారతదేశానికి స్వతంత్రం వచ్చినవెంటనే, మరునాడే, adult franchise వచ్చింది ఇతర ఏదేశం కూడ ఆ విధంగా చేయలేదు ప్రజాస్వామ్యములో అగ్రస్థానం వహించిన ఇంగ్లాండువంటి దేశంలో కూడ ముప్ఫై సంవత్సరాల క్రిందట adult franchise లేదు భారతదేశంలో ప్రజాస్వామ ం పట్ల కాంగ్రెసు నాయకులకు అమిత విశ్వాసమున్నది దానిని మనదేశంలో జాగ్రత్తగా సక్రమంగా

అమలు జరుపుకొని ప్రజాస్వామ్యం స్థిరంగా ఉండాలని కృషి చేస్తున్నారు ఒంతే కాదు ప్రపంచంలో ఏ దేశంలో కూడా నియంతృత్వ పరిపాలన లేకుండా ప్రజాస్వామ్య సిద్ధాంతంద్వారానే పరిపాలన జరగాలనే ఉద్దేశ్యంతో కృషిచేయుటకు భారతదేశము పూనుకొన్నది ప్రజాస్వామ్యాన్ని అమలు పెట్టడంలో సరియైన కట్టుదిట్టములు చేసుకోడానికి ఈ ఎగువ సభ నిర్మించుకోవడం ఎంతైనా అవసరము దీనికి ౧, ౨ లక్షలు అదనంగా ఖర్చు అవుతుందని ఆ విధంగా చూడడం సరియైన దృక్పథం కాదు ఆ విధంగా చూచినట్లైతే ఇంగ్లాండులో పార్లమెంట్లులో ౧,౬౦౦ మెంబర్లు ఉంటూ, ఒక్కొక్క మెంబరుకు వెయ్య రూపాయలు ఇస్తున్నారు ఆ విధంగా ఒక్కొక్కరికి వెయ్యి రూపాయలు ఇస్తున్నారంటే, మొత్తం ఆ పార్లమెంటుకు ఎంత ఖర్చు పెడుతున్నారో గమనించవలసిందని కోరుతున్నాను అక్కడ ప్రజాస్వామికము చాలా జాగ్రత్తగా సాగుతున్నది మనము కూడ వారి levels లో వెళ్లాలంటే మనకెంత ఖర్చు అవుతుందో ఆ విధంగా చేయడానికి సాధ్యమేమో ఆలోచించండి

మనదేశం శక్తివంతమైన దేశం మనకు ఈనాడు లోటు బడ్జెటు ఉండవచ్చును ధనము లేకపోవచ్చును కాని భారతదేశానికి కావలసినంత సంపత్తు ఉన్నది అమెరికా, ఇంగ్లాండు మొదలైన దేశాలకంటే హెచ్చు ధనవంతమైన దేశము అవడానికి ప్రణాళికలు ఉన్నాయి భాగ్యవంతమైన దేశం అవడానికి అవకాశాలు ఉన్నాయి ఈ ప్రణాళికలను అమలులో పెట్టి జయప్రదంగా నిర్వహించుటలో ఎగువ సభలో ఉండే నిపుణులయొక్క సలహాలు మనకు అవసరం అని అనిపిస్తుంది ఈనాడు శాసనసభలోని సభ్యులందరూ ప్రజలచే ఎన్నుకొనబడి వచ్చినవారు కాబట్టి కొన్ని పరిస్థితులలో కేవలం ప్రభుత్వానికి మాప్రజలకున్న సమస్యలు ఇవి అని చెప్పతున్నారేగాని యదార్థ పరిస్థితులు తెలియజెప్పటానికి జంకుతున్నారు ఆ జంకు లేకుండా చేయడానికి ఎగువసభ పనికివస్తుంది మనము చేస్తున్న మంచి చెడ్డలు దీర్ఘంగా ఆలోచించుకొని వారిచ్చినటువంటి సలహాలను మనం పాటించడానికి అవకాశం ఉంటుంది ముఖ్యంగా ఈ విషయంలో పార్టీ భేదాలుగాని, మేము మొదటినుంచి వద్దంటున్నామనేటటువంటి విచక్షణగాని లేకుండా దీనిని ఈ శాసనసభ్యులందరు ఏకగ్రీవంగా ఆమోదించమని విజ్ఞప్తి చేస్తున్నాను

ఇంతకుముందు హైదరాబాదు శాసనసభలోను, అక్కడ కర్నూలులో ఆంధ్ర అసెంబ్లీలో కూడ, దీనిని గురించి చర్చించటం జరిగింది చర్చించి ఒక నిర్ణయానికి వచ్చాము ఎగువ సభ ఉండాలనే నిర్ణయం చేసుకొన్నాము మళ్లీ సూత్ర ప్రాయంగా ఇది ప్యాస్ చేయాలని చెప్పారు కాబట్టి ఆ నిర్ణయానికి కట్టుబడి ఉండాలని నేను ముఖ్యంగా అపోజిషన్ మిత్రులందరినీ హృదయ పూర్వకంగా కోరుతున్నాను దీనివల్ల కాంగ్రెసు బలము పెరుగుతుందని భయపడ నక్కరలేదు ప్రజాస్వామ్యము పట్ల విశ్వాసముతో ఈ సభద్వారా దేశసౌభాగ్యానికి తాముకూడా పాటుపడవచ్చును కాబట్టి ఈ ఎగువ సభను తమరందరూకూడా ఆమోదిస్తారని ఆశిస్తున్నాను పార్టీకక్షలు, వివాదాలు లేకుండా, అటువంటి విచక్షణ లేకుండా దేశావసరాలను దృష్టిలో పెట్టుకొని చూడాలి విద్యారంగంలో, సైన్సులో, వైద్యవిద్య మొదలగు విద్యలలో రిటైర్ అయిన వారు ఆంధ్రదేశంలో ఎంతోమంది ఉన్నారు వారి అనుభవం మనం తీసుకోవాలి ఇటువంటి సభలో వారిని గౌరవించి తీసుకొన్నప్పుడు వారి అనుభవం మనకు లభ్యం

అవుతుంది ఆంధ్రదేశాన్ని అభివృద్ధి చేయుటానికి దేశంలో పెద్దల సలహాలు తీసుకొనటానికి అవకాశం కలుగుతుంది దీనికి డబ్బు అయి పోతుందనగాని, లేక ఎవరి ప్రయోజనాల కొరకో చేస్తున్నారనేది లేకుండా ఈ తీర్మానాన్ని ఏకగ్రీవంగా ప్యాస్ చేస్తారని ఆశిస్తున్నాను ఎగువ సభలు బొంబాయి, మధ్యప్రదేశ్, మద్రాసు మొదలైన రాష్ట్రాలలో ఉన్నాయి మనకు ప్రక్కన ఉన్న మైసూరులో కూడా ఉన్నది దానికంటె మనది పెద్ద రాష్ట్రము కాబట్టి మనం కూడా దీనిని పట్టుదలతో సాధించాలని, మనం మొదట్లో చేసిన నిర్ణయాలకు కట్టుబడి ఉండి మిత్రులు శాసన సభ్యులందరూ ఏకగ్రీవంగా తీర్మానం ఆమోదించాలని కోరుతూ ఈ అవకాశం యిచ్చినందుకు అధ్యక్షులవారికి నాధన్యావాదాలు అర్పిస్తున్నాను

*The Minister for Commerce, Industries and Labour (Shri V B Raju)* Mr Speaker, Sir, I have carefully heard the speech made by

*(At this stage, several hon Members requested the hon Minister to speak in Telugu)*

మిస్టర్ స్పీకర్ —ఎవరి ఇష్టమువచ్చిన భాషలో వారు మాట్లాడవచ్చును ఫర్వాలేదు

శ్రీ కె వెంకటరామారావు (చిన్నకొండూరు) మాదరక్షాస్తు మంజూరు అయినది

మిస్టర్ స్పీకర్ —వారి ఇష్టము తెలుగు, ఉర్దు, ఇంగ్లీషు, ఈ మూడు భాషలలో దేనిలోనైనా మాట్లాడవచ్చును కర్నాటకులు, మహారాష్ట్రులు, వారివారి మాతృభాషలో మాట్లాడవచ్చును ఈ సభలో ఆ సాంప్రదాయం ఉన్నది హక్కు ఉన్నది అందులో మాట్లాడండి, ఇందులో మాట్లాడండి, అని తక్కినవారు అంటూ ఉంటే పని సాగదు

*An hon Member* There is a Tamilian also

*Mr Speaker* If there is a Tamilian member, he can also speak in Tamil, if he does not care to be understood by others

శ్రీ వి బసవరాజు అధ్యక్షా, నిన్న ప్రతిపక్ష నాయకులు మాట్లాడుతూ రెండవ సభను ఏర్పరచే విషయములో ప్రతిఘటన చూపారు అటుల వారు ప్రతిఘటన చూపుటలో వార్ు "డాగ్మాటిక్‌గా", మొండి పట్టుతో మేము ఈ ప్రతిఘటన చేయుటలేదు, ఆ విషయంలో మమ్ములను వప్పించినట్లయితే మేము సహకరించటానికి తయారుగా ఉన్నాము, అనే భావన వెలిబుచ్చారు ఈ constructive proposal ఏదైతే ఉన్నదో అది ఈ ఆంధ్ర ప్రదేశ్ అసెంబ్లీలో ప్రతిపక్షవైఖరిదిగా భావించవచ్చును ఇది చాలా సంతోషించదగిన విషయం రెండవ సభను ఏర్పాటుచేయుట ఏ పార్టీకి లాభవం, ఏ పార్టీకి లాభం లేదు— అనే ప్రాతిపదిక మీద మనము ఆలోచించ కూడదు భారతదేశము చాలా గొప్పది, ఆంధ్ర ప్రదేశము కూడా పెద్ద వైశాల్యము కలిగినటువంటిది మనము యివ్వాళ ఉంటాము, రేపు

ఉండదము, ఈ పార్టీల యొక్క బలము ఈ విధంగా ఉండకపోవచ్చును ఈ రోజున ఈ సభలో కూర్చొన్నవారు, రేపు ఎన్నికయిన తరువాత ఇక్కడ లేక పోవచ్చును ఈ తాత్కాలిక లాభనుల కొరకు మనము చూడకుండా, ప్రజాస్వామ్యాన్ని సుస్థిరం చేయటానికి ప్రయత్నించాలి కొన్ని political institutions రాజకీయ జీవితానికి దోహదమిచ్చే సంస్థలను ఏవిధంగా రూపొందించవలెననే విషయం మనము ఆలోచించాలి ఇవాళ గౌరవసభ్యులు హనుమంతరావు గారు కాంగ్రెసులోని చీలికల విషయం మాట్లాడారు నేను చేసే మనవి ఏమంటే 'Never throw stones, living in a glass house' అని ఎప్పుడుకూడా ఇతర పార్టీలలో ఉన్నటువంటి లోపాలను గురించి ఏపార్టీకి చెందినటువంటి వారూ బహిరంగంగా మాటాడకూడ దని ఇప్పుడు కమ్యూనిస్టు పార్టీలో ఏ చీలికలు ఉన్నవో, పీపుల్సు డెమోక్రటిక్ ఫ్రంట్‌లో ఏ చీలికలు వున్నవో, నేను వాటినిగురించి వ్యాఖ్యానించటానికి తగినవాడను కాను ఆ విషయంలో శ్రీ దేశపాండేగారు, శ్రీ రావి నారాయణరెడ్డిగారు, శ్రీ సుందరయ్యగారు, పెద్దలు వారు వారి అనుచరులుగా వారిలో వెంటవచ్చేవారికి చెప్పుకోవలసిన విషయం దానికి ఇది ఫోరమ్ కాదు, ఈ అసెంబ్లీ ప్లాట్‌ఫారం కాదు ఇంతకుముందు హైదరాబాదు అసెంబ్లీలో ఇటువంటి ఒక సాంప్రదాయాన్ని అనుసరిస్తూ వచ్చాము తిట్టుకొనుట మానివేశాము తిట్టుకొనుట మానివేసినప్పటినుంచి దగ్గరకు రావడానికి అవకాశము దొరికింది పెద్దపెద్ద సమస్యలను పరిష్కరించాం అందుచేత ఆ విషయాలలోనికి పోకుండా, ఎవరిలో ఏ లోపాలు వున్నవి ? లేక ఏ పార్టీకి ఇది లాభిస్తుంది ? అనే మాట కాకుండా, మన రాజకీయ జీవనము ఒక మంచి పునాదిపైన ఉండటానికిగాను, ఈ ఎగువ సభ ఉండటం మంచిదా ? కాదా ? అనే విషయం చెప్పి మిమ్ములను ఒప్పించటానికి ప్రయత్నము చేస్తాను

ఇప్పుడు మన కాన్‌స్టిట్యూషన్ ఫెడరల్ కాన్‌స్టిట్యూషన్ ప్రపంచంలో మన ఫెడరేషన్ వంటి ఫెడరేషన్లు కూడ ఉన్నాయి ఇప్పుడు Un on of Soviet Socialist Republic ఉన్నది Federation of Austrialia ఉన్నది United States of America ఉన్నది నూతనంగా ఏర్పడిన Chinese Republic ఉన్నదీ ఇవి ముఖ్యమైనవి పెద్ద దేశాలు అన్నింటిలోనూ 'ఫెడరల్' పద్ధతి ఉన్నది "యూనిటరీ' పద్ధతి ఉన్న దేశాలతో మనం పోల్చుకొని లాభంలేదు ఇప్పుడే మిత్రులు ఒకరు మాట్లాడుతూ ప్రపంచంలో ఎక్కడా కూడా Federal Union లో చేరిన 'స్టేట్సు' లోపల 'బైకామెరల్ సిషమ్' లేదని అన్నారు బహుశః అది వారి దృష్టిలోకి రాకపోయి ఉండవచ్చును వారి దృష్టి కేవలం సోవియట్ యూనియన్ మీదనే ఉండి ఉండవచ్చును కాని అటువంటివి వున్నాయి

యునైటెడ్ స్టేట్సులో ఉన్నటువంటిది బైకామెరల్ లెజిస్లేచరు ఒక సిద్ధాంతం ప్రపంచం ఒప్పుకొన్నది ఎక్కడైతే 'ఫెడరల్ స్ట్రక్చర్' ఉంటుందో, యూనియన్ లెజిస్లేచర్ ఉంటుందో అక్కడ బై-కేమెరల్ పద్ధతి ఉండటము మంచిదని ఒప్పుకొన్నారు అది మూల సిద్ధాంతం, ఫెడరల్ పద్ధతిలో మూలసూత్రమే అది ఏఏ కూటాలయితే, ఏఏ యూనిట్సుయితే త్యాగంచేసి ఒక యూనియన్‌లోకి, దగ్గరగా వద్దామని ప్రయత్నిస్తాయో, వాటిని తృప్తి పరచటానికి, అనుమానాలు కలుగకుండా ఉండటానికి ఫెడరల్ స్ట్రక్చరులో బై-కామెరల్ సిస్టము

ఒప్పుకొన్నారు, ఇది ప్రతిచోట ఉన్నది ఎవరికీ తగాదా లేదు ఎక్కడైతే Union of States of Republics ఉన్నాయో అక్కడ బై-కామెరల్ సిస్టము ఉన్నది United States of America లో చేరిన ఒక్క స్టేటులో తప్ప తక్కిన అన్ని చోట్ల బై-కేమెరల్ పద్ధతి ఉన్నది నెబరాస్కా-స్టేటులో తప్ప తక్కిన అన్ని స్టేట్సులోను బై-కామెరల్ సిస్టము ఉన్నది ఆస్ట్రేలియాలో ఒక క్వీన్సులాండ్‌లో తప్ప తక్కిన స్టేట్సు అన్నింటిలో బై-కామెరల్ పద్ధతి ఉన్నది అక్కడ యు యస్ యస్ ఆర్ లో లేదు యుని-కామెరల్ సిస్టమ్ ఉన్నది చైనీస్‌రిపబ్లిక్ ఏదైతే ఉన్నదో, అది formative stage లో ఉన్నది ఇంకా అది మనకు యీ రోజున ఉదాహరణగా ఉండజాలదు అందుచేత ప్రపంచంలో పోల్చుకున్నప్పుడు కూడా, మనం కేవలం రష్యాతో పోల్చుకోకుండా, ఎక్కడైతే అనుభవము గణించబడిన ప్రాంతాలున్నాయో, ఆ ప్రాంతాలతో పోల్చుకోవటం మంచిది వచ్చిన పొరపాటు ఎక్కడ ఉన్నదంటే, మనం పార్టీఇజాన్ని డెవలప్ చేస్తున్నాము ఈ పార్టీయిజమ్ డెవలప్ చేయుటంలో మనం dogmatic అవుతున్నాము పార్టీజమ్ డెవలప్ కాకుండా, నిజానికి ఒక సిద్ధాంతరీత్యా, నూతన భావాలు, నూతన ఉద్దేశాలు ప్రజలలో రావలెననే ఉద్దేశం మనకు ఉన్నట్లయితే మనము ఏర్పాటు చేసుకొనేటటువంటి political institutions broad based గా ఉండవలెను అసలు democracy అనేది ఒక compromise తమకు విరుద్ధంగా మాట్లాడేవాడిమాటలో సత్యం ఉన్నదనేటటువంటిది గుర్తించి మాట్లాడటము, అవకాశము ఉన్నట్లయితే కొంత నా భావాలను నేను మార్చుకొని అతని భావాలకు అవకాశము ఇవ్వటానికి ప్రయత్నము చేయటము ఇదిగనుక మన ఉద్దేశమైతే, మనవ మనపార్టీయొక్క మూలసిద్ధాంతాలకుగాని, లేక ప్రతిపక్షం యొక్క లక్ష్యాలనుగాని, మాపార్టీ యొక్క అవసరములనుగాని దృషి లో పెట్టుకోకుండా చూడవలసి ఉన్నది అందుచేత భారతదేశములో ఏ సామాజిక నిర్మాణము ఉన్నదో, ఎటువంటి ఆర్థికపరిస్థితులలో మనము ఉన్నామో, మన వెనుకటి చరిత్ర ఏదైతే ఉన్నదో, వ టిని దృష్టిలోపెట్టుకొన్నప్పుడు మనకు రెండవశాసనసభ అనండి, లేక ఎగువశాసనసభ అనండి, లేక దానిపేరు పెద్దలసభ అనండి, దాని యొక్క అవసరము మనకు ఉన్నది నేను ప్రత్యేకించి హైదరాబాదు శాసనసభ్యులకు జ్ఞాపకం చేస్తున్నాను ఎవరైతే రీజినల్ కమిటీ కావాలని అన్నారో, వారికి జ్ఞాపకం చేస్తున్నాను ప్రతిపక్ష సభ్యులుగా ఉన్నటువంటి శ్రీ వి డి దేశపాండేగారు రీజినల్‌కమిటీ కావాలని కోరిన వారిలో ఒకరు I mean Sri Deshpande was one of those who wanted Regional Committee for Telangana అటువంటివారికి జ్ఞాపకం చేస్తున్నాను ఒక ప్రత్యేకమైన interest, territorial interest not class interest— తెలంగాణాలో ఉన్నది ప్రత్యేకమైన territorial interest ఉన్నదని ఒప్పుకొన్నప్పుడు దానికి ఒక రీజినల్‌కమిటీని కోరినపుడు ఒక విషయం గ్రహించాలి నేను మనవి చేసేదేమంటే సమాజంలో ఒక పొలిటికల్ ఇంటరెస్టేకాదు వేరే cultural interests కూడా ఉన్నాయి There are social interests apart from economic interests మనం, సభ్యులం అందరంకూడా, ఇక్కడ territorial constituencies ద్వారా ఎన్నికై వచ్చాము మనం ఏ functional interests, ను ఏ profession ను represent చేయము ఒక్క territorial constituencies

మాత్రమే మనము represent చేస్తాము ఆ constituency లోపల అనేక interests ఉన్నాయి ఈ సొసైటీ ఏదైతే ఉన్నదో అది ఒక రాయి వంటిది కాదు లేక క్రిందినుంచి పైవరకు ఒకేరకంగా ఉన్నది కాదు ఇవాళ మన సమాజం ఎట్లా ఉన్నది అనగా, అనేక interests కలిస్తే యీ సమాజము అయినది అందుకు నేను మనవిచేసేదేమంటే, మనము territorial interests కొరకు ప్రాంతాల యొక్క ప్రత్యేకత ఉన్నదని ఒకవైపున చెబుతూ, రెండోవైపున సమాజంలో వేరే interests ఉన్నాయనే విషయం గుర్తించకుండా కేవలం political party పద్ధతి మీద మనం ఓట్లు సంపాదించుకొని, యీ శాసనసభలో కూర్చొని, అందరికీ మనం న్యాయం చేయగలుగుతామనే మాటను చెప్పటానికి నేను సాహసించలేను అందుకనే పై సభలో representation for certain interests ఏర్పాటు చేయబడింది అక్కడ electoral colleges ఏవైతే ఉన్నాయో, graduates కానివ్వండి, local bodies కానివ్వండి, teachers కానివ్వండి, లేక గవర్నర్ గారు nominate చేసే quota లో కూడా "people who have got something to do with literature or art" అయినటువంటి వారిని ఈ విధంగా, ఒక territory ని దృష్టిలో పెట్టుకోకుండా కొన్ని functional interest ను దృష్టిలో పెట్టుకొని కౌన్సిల్‌ను ఏర్పాటుచేస్తున్నారు అంటే లెజిస్లేచర్‌ను balance చేయటం అన్నమాట క్రింది సభ territorial constituencies represent చేస్తే, పై సభ functional interests represent చేస్తుంది, అనేటటువంటి ఒక రాజకీయ సిద్ధాంతం దీనివెనుక ఉన్నది ఆ రాజనీతి దీనివెనుక ఉన్నది నేనూ ఒప్పుకొంటున్నాను, ఏ interests అయితే, ఏ అవసరములు అయితే పైసభలో గుర్తింపబడుతున్నాయో అవి చాలవు అని దానికి మనము constitution ను amend చేయించ వచ్చును ఇవాళ పై శాసనసభను ఏర్పాటుచేయటము అంటే Constitution ను amend చేయటముకాదు Article 358 క్రింద Parliament by Law can do it కనుక trade unions కు Co operatives కు ఇంకా ఇతర సంస్థలు ఏవైతే ఉన్నాయో వాటికి, ప్రాతినిధ్యం దొరికేటట్లుగా మనము ప్రయత్నము చేయటము అవసరము అయిఉన్నది దేశమునకు సామాజిక అవసరము ఉన్నది ప్రత్యేకంగా, statutory గా constitutional గా electoral colleges ఏర్పడేటట్లుగా, ఆ electoral colleges నుంచి వారు ఎన్నికై వచ్చేట్లుగా చూడ వలసిన అవసరం ఉంటే ఉండవచ్చును ఇప్పుడు ఏవైనా మార్పులువస్తే, సామాజికంగా లేక రాజకీయంగా దానియొక్క ప్రభావము ఏదైతే ఉన్నదో అది structure of the State మీద పడుతుంది ఈ స్టేటుయొక్క నిర్మాణంమీద పడుతుంది political stage నుంచి మనం economic stage లోనికి మారుతున్నాము ఇవాళ ప్రభుత్వం ఏదైతే ఉన్నదో, దాని పని కేవలం Law and Order ను చూడటమే కాదు, సామాజిక, ఆర్థిక అవసరములను తీర్చుటకొరకై అనేక కార్యక్రమములు తీసుకోవటమే కాకుండా ప్రజలయొక్క జీవన ప్రమాణమును వృద్ధిచేయవలెను ఇటువంటి పరిస్థితుల్లో నేను

ఒకటి మనవిచేసియున్నాను, Political assemblies మాత్రమే కాకుండా economic assemblies కూడా ఉండవలెను అని మనదగ్గరకు ఏదైనా ఒక శాసనము వచ్చినపుడు,—దిగువ సభకు, ఎగువసభకు కూడా—ఆ సభలో మొదలు పెట్టవలసినవి ఏవి ? యీ శాసనసభలో మొదలుపెట్టవలసినవి ఏవి ? యీ సభలోనుంచి initiate కావలసినవి ఏవి ? అనేటటువంటి వాటియొక్క కోడ్ ఒకటి ఉన్నట్లయితే మంచిదని నా అభిప్రాయము ఉదాహరణకు Second Five-Year Plan ఉన్నదనుకోండి, ఆర్థిక విషయాల మీద శ్రద్ధను ఎక్కువగా పై సభ కేంద్రీకరిస్తే మంచిది దానికి సంబంధించిన శాసనాలన్నీ కూడా అక్కడ initiate అయి, అక్కడే చాలామటుకు preliminary discussion అయి, అక్కడే దానిమీద వెలుతురు పడి, దానిలాభము కనుక యీ క్రింది సభకు దొరికినట్లయితే ఉపయోగంగా ఉంటుంది అన్ని బిల్లులు కూడా అన్ని చిత్తు శాసనాలు కూడా, ఇచ్చటనే ప్రవేశపెట్టవలసిన అవసరం లేదు పై సభలో కూడా ప్రవేశపెట్టవచ్చును పైసభలో ప్రవేశపెట్టేటటువంటివి ఏవైతే ఉన్నాయో అవి చాలావరకు రాజకీయ దృక్పథంతో చేసే శాసనములు కాకుండా, సామాజిక ఆర్థిక అవసరముల కొరకు ఏవైతే ఉన్నవో వాటిమీద ఎక్కువ దృష్టిని కేంద్రీకరించటంకొరకు, వాటి విషయాలు ఎక్కువగా క్రింది శాసనసభకు తెలియజెయ్యటముకొరకు, పైసభలోనే పనిజరిగితే బాగుంటుంది ఎంతసేపు చెప్పినాకూడా, విద్యాధికులకొరకు పైసభ అని అన్నామంటే, మనము విద్యలేనివారమని అనుకోరాదు హనుమంతరావుగారు ! అక్కడకు తెలివిగలవారు రావాలంటే మనము తెలివి తక్కువవారమని అనుకోవద్దు మనం పొద్దుటనుంచి సాయంత్రంవరకు మాట్లాడేమాటలన్నీ కూడ, నా కాంగ్రెసు పార్టీకి ఏ విధంగా లాభం ఉంటుంది, మా కమ్యూనిస్టుపార్టీకి ఏ విధంగా లాభం ఉంటుంది అనే ఉద్దేశ్యంతోనే మాట్లాడుతుంటాము అసలు ఈ శాసన సభలో ఇక్కడి సభ్యులను ఒప్పించటానికి కానివ్వండి, లేదా బయటవారికొరకు, ఓట్లకొరకు కాని వ్వండి, మాట్లాడుతూ ఉంటాము ఎంతసేపటికీ, రాజకీయంగా మనం ఆలోచిస్తూ ఉంటాము కాని పై సభలో ఉండేవారు యీ విషయాలన్నీ శాంతియుతంగా, నెమ్మదిగా ఆలోచించటానికి వీలుంటుంది అది మన లాభంకోసమే చేస్తున్నాము ఐదు సంవత్సరాలనుంచి మనకుఅనుభవమ్ము ఉన్నది మన అనుభవములోని కొన్ని ఉదాహరణలు చెబుతాను మనముందర "cusec" అనేమాట ఉన్నది, ఆ మాట అర్థం తెలుసుకోటానికి, మన డిక్షనరీలో కనబడదు అది డిక్షనరీని కొంతమంది వెతికారు, 'cusec' అన్నమాట ఎక్కడ ఉన్నదీ అని cusec అంటే cubic feet per second ఆర్బిట్రరీగా ఇంజనీరింగ్ డిపార్టు మెంటువారు తయారుచేసింది ఆ మాట ఆ మాట తెలియాలంటే కొన్నాళ్లు పడుతుంది మనకు ఒక మినిష్టర్‌గారికి ఒక డిపార్టుమెంట్ తన చేతిలోనికి రాగానే, ఆ డిపార్టుమెంటుకు సంబంధించిన ఫైలు తనదగ్గరకు వసే, వెంటనే సెక్రెటరీని అడగబుద్ధిపుడుతుంది ఎన్నో యబ్రివేషన్స్ ఉంటాయి సెక్రటరీని అడిగితే ఏమనుకొంటాడోనని ఆయనను అడిగినట్లు కాకుండా, ఎట్లాగో అట్లా తెలుసుకోటానికి ప్రయత్నిస్తాడు పోనీ, పరసనల్ సెక్రెటరీని అడిగితే బాగుండదమో ? అందుచేత ఒక్కొక్కసారి సంతకంపెట్టి పంపిస్తాడు తరువాత మెల్లిమెల్లిగా అంతా తెలుసుకోటానికి ప్రయత్నం చేస్తాడు అదంతా మనం తెలుసుకొనే టప్పటికి పుణ్యకాలం వెళ్లిపోతుంది అందుకోసం, మనం ఆలోచించేదేమంటే, ఏవైతే టెక్నికల్

మేటర్సు ఉన్నవో, ఎక్కడైతే ఎక్కువ శోధ్ధ, ఎక్కువ స్టడీ అవసరం ఉన్నదో, అటువంటి విషయాలను పెద్దలకు వదలిపెట్టటం మంచిది మనకూ లాభం ఉన్నది దాంట్లో చివరకు మనకే అధికారము ఉన్నది, క్రిందిసభకే ఉన్నది దానిని ప్యాస్ చేయాలా, అక్కరలేదా అనేది నిర్ణయించటానికి మనకు అధికారము ఉన్నది Consultative గా deliberative గా ఆ బాడీ పనిచేస్తున్నట్లయితే, అందుకు మనకు అభ్యంతరం ఉండకూడదు

ఇంకొక ముఖ్యమైన విషయము క్రింది శాసనసభలు ఏవైతే ఉన్నవో, అవి ఐదు సంవత్సరముల కొకసారి ఎన్నికలకు పోతుంటాయి లేదా, అవసరము పడినట్లయితే, ప్రభుత్వం ఏర్పాటు కాకపోయినట్లయితే, గవర్నరుగారు తలచుకొన్నట్లయితే యీ క్రింది సభకు dissolution ఉన్నది కాని, పై సభకు లెజిస్లేటివ్ కౌన్సిలుకు dissolution లేదు అది continuing body డెమాక్రసీలో అన్నిమంచి విషయాలే ఉన్నాయి, ఒకటి తప్ప అది ఏమిటంటే, యీ డెమాక్రసీలో continuity లేకపోవడం ప్రభుత్వాలు మారడము వల్ల పార్టీలు అవకతవకలు కావడమువల్ల శాసనసభలకు క్రొత్తవాండ్లు రావడమువల్ల అనుభవముగల పాతవాండ్లు పోవడమువల్ల ప్రజాస్వామ్యములో ఒక చిన్న లోపము కనబడుతుంది, continuity of policy and continuity of action లేకుండా పోతుంది ఈ లోపమును కొంతవరకు ఎగువ శాసనసభ తీరుస్తుంది అందుకని continuity కొరకు ఎగువ శాసనసభను వుంచడము మంచిది అదే కాకుండా business కూడా తొందరగాకావడానికి వీలు వుంటుంది క్రింది శాసనసభలో ఏదైనా ఒక బిల్లు ప్రవేశపెట్టిన తర్వాత అదిపూర్తికాకపోయినట్లయి తే అంత లోపల ఆ Assembly dissolve అయిపోయినట్లయితే మళ్ళీ దానిని క్రొత్తగా ప్రవేశ పెట్టవలసి వస్తుంది కాని పై శాసనసభలోప్రవేశపెట్టినట్లయితే అసెంబ్లీ dissolve అయినప్పటికీకూడా ఆ బిల్లుకు ప్రాణము వుంటుంది అలాంటి లాభాలు కొన్ని వున్నాయి కాని ఒక విషయములో మాత్రము నేను ప్రతిపక్ష సభ్యులతో ఏకీభవిస్తున్నాను క్రింది సభ ఒక్కటే వున్నట్లయితే తొందరగా పని జరుపుకోవచ్చును హైదరాబాదు శాసన సభలో కొన్ని నిమిషాలలో బిల్లులు pass చేసినాము తొందరగా జరిగిన పనులున్నాయి పని తొందరగా జరగకుండా కొంత ఆటంకము కూడా ఏర్పడవచ్చును కాని ఆటంకము కూడా ఏర్పడడము మంచిది ఎన్ని అభిప్రాయాలు ఎక్కువగా వస్తే అంత మంచిది అధికారము మన చేతిలో వున్నపుడు మనమెందుకు భయపడాలి? క్రింది శాసనసభకు అధికారమున్నపుడు వాండ్లు అడ్డమువస్తారని ఎందుకు భయపడాలి? ఇక డబ్బు విషయము చెప్పతూ వచ్చారు అసలు పోలీసు శాఖమీద, మిలిటరీ శాఖమీద ఎంతో డబ్బు ఖర్చు పెట్టుతున్నాము మీరు ఈ పోలీసు, మిలిటిరీలను తీసివేయమని ఎన్నాళ్ళనుంచో కేకలు పెట్టుతున్నారు కదా ఎన్నాళ్ళనుంచో విమర్శించారు కదా దేశములో అలజడి లేకపోతే పోలీసు, మిలిటిరీలతో అవసరమేమీ లేదు దేశములో కొంత అలజడి వుంటుంది కొన్ని అవకతవకలు ఔతాయని చెప్పి పోలీసు, మిలిటిరీలను పెట్టాము పోని ఇక్కడ శాసనసభ్యులగు మనకు యీ సీట్లు ఎందుకం

మనమందరము కూడా శుభ్రంగా జముకాణములు వేసుకొని కూర్చొని హరికధలు చెప్పినట్లుగా చెప్పుకోకూడదా ? మన సంగతే ఆలోచించుకుందాము మనకు జీతాలెందుకు మనమీద కూడా ౧౦–౧౫ లక్షల రూపాయలు ఖర్చు ఔతున్నది ఈ ౧౦–౧౫ లక్షల రూపాయలు ఖర్చు పెట్టి మీరు చేసేది ఏమిటని బజారులో అంటున్నారు మనలను ఈ రోజు ఒక శాసన ముంటుంది ఇంకొక session వచ్చేటప్పటికల్లా దానికొక amendment వుంటుంది ఈవేళ మనము ఒక శాసనము చేయడము, రెండవ రోజున దానికి amendment తీసుకురావడము, మూడవరోజున, చేసిన amendment కు మళ్ళీ amendment చేయడము అంతే కాదు యీలోగా High Court కు ఎవరయినా పోయినట్లయితే అక్కడ అది *Ultra vires* అన్నట్లైతే మళ్ళీ శాసనసభ మొదలుపెట్టడము జరుగుతుంది లేదా మన President గారికి పంపిస్తే కాదు అని వారు తిరగగొట్టడము—ఇవన్నీ వున్నాయి మనలను గురించి ఇతరులు ఏమి విమర్శిస్తారో గమనించకుండా మనము కూడా పై శాసనసభను విమర్శించబోతున్నాము కనుక ఇది 'అత్త, కోడలు" వ్యవహారము తప్ప మరేమి కాదు కనుక డబ్బు విషయం అటు వుంచండి ద్వితీయ పంచవర్ష ప్రణాళికను ముడి పెట్టడము మనకు అలవాటు అయింది Election platform కానివ్వండి ఇక ఏ విషయం వచ్చినా సరే దానిలో Second Five Year Plan గురించి వుంటుంది నీళ్ళు లేవు, schools లేవు అని అంటుంటారు నిజమే లేవు కనుకనే ఈ ప్లాన్ పెట్టాము మనము ఏ శాసనము చేసు కొన్నా ఆ శాసనము ఎయటికి పోకముందే మన పెద్దలు మనపై కూర్చొని తగు సలహాలు యిచ్చి "ఇదిగో, దీనిని ప్రజలు సహింపరు " అని చెప్పుతారు సలహాయిస్తే ఆ సలహా యీసభకు ఉపయోగపడుతుందని చెప్పుతున్నాను డబ్బు ఎక్కువ అవుతుందనే సాకు పెట్టవద్దు నేను చాల time తీసుకున్నాను భారతదేశములో అనేక రాష్ట్రాలలో యీ పై సభలు ఏర్పాటు అయినాయి పదమూడింటిలో, అస్సాం, కేరళ, ఒరిస్సా, రాజస్థాన్‌లకు లేవు ఉత్తర ప్రదేశ్‌లో ఎందుకు వుండాలి ? మైసూరులో ఎందుకు వుండాలి ? రద్దుచేస్తే అన్ని చోట్ల చేయండి మనకు అక్కరలేదని ఏకారణాలు చెప్పుతూ వుంటారో, ఆ కారణాలనే చూపి ఎక్కడా లేకుండా వుండాలని, అవన్నీ తీసివేయాలని చెప్పండి ఇపుడు వాండ్లు అన్నిటినీ తీసివేయమని అనడము లేదు బొంబాయిలో యీ మధ్యనే ఒక తీర్మానము pass చేశారు వద్దని చెప్పి—

*Shri V D Deshpande (Ippaguda)* Why does not the hon Minister plead for Kerala where there are so many interests and where the State is well developed

*Shri V B Raju* I am not going to plead for others I am trying to justify my demand It is for them to decide their democratic policy and we shall not interfere in others matters, and as a matter of fact I have a serious objection Yesterday some hon Members in the House had tried to throw some light on the affairs of Houses and even mentioned the names of members also It is not necessary for us to do that. Let us confine to ourselves

హైదరాబాదు శాసనసభలో 2/3 majority తో యీ తీర్మానము pass చేయలేదు ఆ కారణమువల్ల పార్లమెంటువారు మధ్యప్రదేశ్ కు కౌన్సిలును ఏర్పాటు చేస్తున్నా, ఆంధ్రప్రదేశ్ కు ఏర్పాటు చేయలేదు పార్లమెంటులో ఇదివరకే అక్కరలేదని గుర్తించారు కనుక ఇటువంటి ఎగువసభ అక్కరలేదు అని కొంతమంది నిన్న మాట్లాడినట్లు కనబడింది Article 169 క్రింద శాసనసభలో ౨/3 majority తో ఆ తీర్మానాన్ని నెగ్గించవలెనని వుంటే హైదరాబాదు శాసనసభ వుండనపుడు యీ సంస్య ఉత్పన్నము కాదు హైదరాబాదు శాసనసభకు ఎగువసభ కావాలని, హైదరాబాదు శాసనసభ్యులు తీర్మానము చేయడము అనేది జరిగింది అపుడు అన్ని తీర్మానాలతోబాటు అదికూడా చేశాము నాకు బాగా జ్ఞాపకముంది దేశ్‌పాండేగారు ఒడిగారు ౨/3 majority లేదన్నారు ఆ రోజున రామకృష్ణరావుగారు ఏమి జవాబు ఇచ్చారో ఆయననే మళ్ళీచెప్పమని అడగండి ౨/3 majority వుంటే ఏమి, వుండకపోతేనేమి, పార్లమెంటు గుర్తించితేనేమి గుర్తించకపోతేనేమి, తీర్మానము చేయడము మావంతు చేసివేశాము అసలు నిజంగా చేయవలసింది వుంటే అది ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ చేయాలి Andhra Assembly is a continuous Assembly ఆంధ్ర అసెంబ్లీ ౨/3 majority తో pass చేసినది ఈవేళ తెలంగాణా వారు ౧౦౦ సభ్యులు These members are added to the Andhra Assembly

*Shri V D Deshpande* These members were divided and there was not even two thirds majority

*Shri V B Raju* I am not prepared for all these challenges I am speaking on a Constitutional point

Article ౧౬౯ క్రింద ఆంధ్రఅసెంబ్లీ తీర్మానము pass చేసింది మళ్ళీ ఇపుడు దానిని pass చేసే అవసరముకూడా లేదు తెలంగాణా సభ్యులు ఆ అసెంబ్లీలో చేరినారు

శ్రీ కట్టా రామిరెడ్డి అవసరమే లేనప్పుడు ఇప్పుడు ఈ resolution ను పెట్టవలసిన ఆగత్యమేమి వచ్చింది?

*Mr Speaker* He is not yielding

శ్రీ వి బి రాజు ఉపసంహారణ కోసము సవరను తీసుకొచ్చి ౨/3 majority తో నెగ్గించుకున్నారా, వారు ఘనులు కనుక అదికాదు అసల ఇదివరకే ఒది pass అయింది అక్కడ ఆంధ్రఅసెంబ్లీలో మన తెలంగాణా సభ్యులెవరైతే వున్నారో వారు చేరారు మనము చేరడమువల్ల ఆ తీర్మానానికి ఏమి లోటు కలుగ లేదు కాని ప్రభుత్వము యీ అవకాశాన్ని మనకు ఇచ్చింది ప్రభుత్వమునుంచే యీ తీర్మానము ప్రవేశ పెట్టబడింది తెలంగాణా సభ్యులను కూడా దగ్గరకు తీసుకుని వాండ్లతో కూడా మళ్ళీ తీర్మానము చేస్తే దీనికి బాగాబలము వుంటుందని చేసినాము అసలు మధ్యప్రదేశ్ కు ఎందుకు కౌన్సిలు ఏర్పాటు చేశారు? ఆంధ్రప్రదేశ్ కు ఎందుకు చేయలేదు? అని ఒక వాదన వున్నది మధ్యప్రదేశ్ కు States Re-organisation Act క్రింద ఏర్పాటు చేశారు మధ్యప్రదేశ్ అనేది క్రొత్తగా ఏర్పడుతున్న

state క్రొత్తగా ఏర్పడిన state కనుక వారు resolution పెట్టగలిగారు ఆంధ్రప్రదేశ్ అనేది continuing state కనుక పార్లమెంటు దీనిని By law చేయవలెను అందుచేత constitution ప్రకారముకూడా మనము సరియైన పద్ధతిలో వున్నాము ఆంధ్రప్రదేశ్ అసెంబీ కి తన అభిప్రాయం చెప్పే అవకాశమున్నది ఆంధ్ర అసెంబ్లీ చేసినదే చాలు, నేను మనవి చేసేది ఏమిటంటే మనకు పనికూడా ఎక్కువవుతున్నది క్రింది అసెంబ్లీకి పని చాలా ఎక్కువ ఔతున్నది పని ఎక్కువ అవుచున్న ఈ సమయములో మన భారాన్ని మోయడానికి కొంతమంది పెద్దలు కావాల అటువంటి పెద్దలు అనుభవమున్నవారు కనుక, వారు పై సభలో వుంటే మనకు అవసరము వచ్చినపుడల్లా సహా యిస్తూ మనమేదైనా పొరపాటు చేసినట్లయితే వారు దానిని సవరి స్తున్నట్లయితే దేశానికి, ప్రజలకూ, అందరికీమంచిది కనుక నేను ప్రతిపక్ష సభ్యులను ప్రార్థించేది ఏమిటంటేనేక దానిని వ్యతిరేకించే వారికి ప్రార్థన చేసేది ఏమిటంటే, మనపార్టీలు మన వ్యవహారా లంతా కట్టిపెట్టి మనము ఇటువంటి సభను ఏర్పాటు చేసుకుందామని నిజంగా అది కనుక Fifth wheel of the car కాకుండా Fifth wheel of the coach ఐనట్లయితే నేను కూడా మీతో సహకరిస్తాను నా ఉద్దేశములో అది Fifth wheel of the cart కాదు అది Fifth wheel of the coach ఎప్పుడైనా నాలుగు చక్రాలలో ఒక చక్రం పాడైపోయే ప్రమాదము వుంటుంది అటువంటపుడు అయిదవ చక్రం మనకు అవసరం వుంటుంద కనుక మీరు మాత్రము దీనిని Fifth wheel of the car అని అనుకోవద్దని ప్రార్థిస్తూ సెలవు తీసుకుంటున్నాను

శ్రీ కట్టా రామిరెడ్డి అధ్యక్షా, నిన్నటినుంచి ఆంధ్రప్రదేశ్ కు ఎగువ సభ కావాలా వద్దా అనే చర్చ దీర్ఘంగా జరిగింది ఆ చర్చలో ఎగువ సభఎందుకవసరము అన్న దానినిగురించి తీర్మానమును ప్రతిపాదించిన వారుగాని, యితర మంత్రులుగాని, గౌరవ కాంగ్రెసు సభ్యులుగాని, కేవలం యింతే చెబుతున్నారు ఏమిటంటే మనం మనలో కొంతమంది నిపుణులను, తెలివిగల వాళ్ళను, trade unions వారిని చేర్చుకోడానికి అవకాశం లేదు కాబట్టి అటువంటి వాళ్ళందరూ కూడా యీ దిగవ శాసనసభకు రావడానికి వీలుకాదు కనుక, ఎగువ సభకు పంపించాలి అని ఒక వాదన చేస్తున్నారు ఆ తరువాత యింకా ఏమిటంటు న్నారంటే మనం Federal constitution క్రింద ఉన్నాము గనుక, ప్రతి దానికి ఎగువ సభ కావాలి అనే నిర్ణయం ఉండాలని యిప్పుడే ఒక గౌరవనీయులైన మంత్రి గారు సెలవిచ్చారు రెండుమూడు విషయాలు చాలా లోతుగా ఆలోచించాలని మనవి చేస్తు న్నాను మనది రాజ్యాంగచట్టం రీత్యా secular state శాసనసభలకు ప్రతి నిధులు ప్రజల ఓటుతో ఎన్నుబడవలసి ఉంది అంటే అప్పుడు మనం యీ నిపుణులు గాని, సంఘములవారు గాని యితర Associations వారుగాని ఎందుకు రావడం లేదనే సమస్య మాత్రం ఆలోచించవలసివుంటుంది ఈ అంశం మీద యింతవరకూ, తీర్మానం ప్రతిపాదించిన గౌరవనీయులు ముఖ్యమంత్రిగారుగాని తదితర గౌరవసభ్యులుగాని ఒక మాట కూడా చెప్పలేదు ఏమిటిది ? పార్టీల నిర్మాణంలోగల లోటా ? అటువంటి తెలివిగలవారు రాదలచుకోక మేము ఎగువ సభకే వస్తాము అని చెప్పినటువంటి మాట యీ నిర్ణయమునకు

తగిన కారణంకాదు ఇప్పటివరకు మన గౌరవ కాంగ్రెసు సభ్యులు మాట్లాడిన దానిని బట్టి ఒకటే అర్థమవుతున్నది ఎన్నికలలో పార్టీబలాలు తెలుస్తవి కనుక మా యిష్టం వచ్చినటువంటి వాళ్లను ఎన్నుకుంటాం, కాని మాకు తెలివిలేని దగ్గర, ఎప్పుడైతే సాంకేతికాభిప్రాయం కావాలో అప్పుడు మాత్రం ఎగువ సభకు నలుగురుని పెంటబెట్టుకు వస్తాం అనే దృక్పథమే కనబడుతోంది ఇదికూడా కొంచెం దీర్ఘంగా ఆలోచించాలని మనవి చేస్తున్నాను ఆంధ్రరాష్ట్రం ౧౯౫౩వ సంవత్సరంలో వచ్చింది, వచ్చిన తరువాత ఎగువసభ లేకుండా జరిగిన యిబ్బంది ఏమిటో ఒక సభ్యుడు కూడా బయట పెట్టలేదు శాసనాలు ఆగిపోయినాయా ? లేక ఏ యితర సాంకేతిక కారణాలవల్ల ఏది ఆగిపోయింది ? అనేది ఆలోచించవలసి వున్నది గౌరవనీయులు లేబరు మంత్రిగారు మన హైదరాబాదు రాష్ట్రంవున్నప్పుడు ఇట్టి తీర్మానంపై వోటు చేసిన సభ్యులలో ౨/3 ఎంతమందో, ఎంత majority వచ్చిందో సూచించకుండా తేలికగా దాటుకున్నారు కాని యిది ప్రజాస్వామ్యానికి విరుద్ధమని నేను మనవి చేస్తు న్నాను Constitution లో provision వున్నది కాబట్టి, ఎగువ సభలు యితర చోట్ల ఉన్నవి continue అవుతున్నాయి కాబట్టి క్రొత్తగా ఎగువ సభలను సృష్టించాలన్న దృష్టి యీరోజు పార్లమెంటులో లేదు అది కేవలం మనం భిక్షం అడిగితే వారు దయతలచి పెట్టవలసినదే అటువంటి భిక్ష మనం ఎందుకు అడగవలసి వచ్చింది ? ఆంధ్రరాష్ట్రం గత మూడు సంవత్సరములు ఎగువ సభ లేకుండా నడవగలిగినప్పుడు యికముందు కూడా ఎందుకు జరగదు ? మన స్పీకరుగారికి రాజదండం కల్గిఉండే అధికారం యిచ్చారు అది ఫ్యూడల్ విధాన లక్షణమనే కారణాన తీసేసినాము మనం ఎక్కడనుంచయితే Constitution తెచ్చుకున్నామో అక్కడనే దీనిని కూడా అడిగి తెచ్చుకున్నాము మన భారత దేశమునకు స్వాతంత్రంవచ్చిన తరువాత ఒక రాజ్యాంగం కావల్సివచ్చింది Australia నుంచి America నుంచి Britain నుంచి, ఎన్నో దిక్కులనుంచి సమాచారమును సేకరించుకొని ఒక రాజ్యాంగమును ఏర్పరచుకున్నాము ఆ రాజ్యాంగం క్రింద నడుస్తున్నాము ఎగువ సభ వంటి సంస్థలు అవసరమా లేదా అని మనం చూచినప్పుడు, ప్రజాస్వామ్యంలో ఉన్నాము కనుక, ప్రజల దృష్టితోటి భవిష్యత్తు దృష్టిలో పెట్టుకొని ఆలోచించవలసి యున్నది కేవలం గుడ్డిగా చేయకూడదు మైసూరులో కౌన్సిల్ వున్నది, హైదరాబాదు లో లేదు మైసూరు హైదరాబాదుకంటె చిన్నది అక్కడ ఒక tradition గా వస్తోంది కాబట్టి దానిని continue చేస్తున్నారు ఇతర రాష్ట్రాలలో వుంది కాబట్టి మనకు ఒకటి ఉండాలనే దృష్టితో పోవడం గుడ్డిగా పోవడం తప్ప యింకొకటికాదు ఇంకో విషయం నిన్న తీర్మానమును ప్రతిపాదించిన శాసనసభా నాయకుడు చాలా తేలికగా దాటుకున్నారు కొన్ని లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది, అది ఏ మాత్రం, ఒక లెక్కా అన్నారు మనమందరమూ ప్రజలనుంచి ఎన్నికైనవారము మన ఫ్యూడల్ కాలములో, ఆ తరువాత కాలంలో, స్వతంత్రం రాకముందటి కాలంలో, ప్రజా ధనము దుర్వినియోగం గూర్చి ఆక్షేపిస్తూ, జాగ్రత్తగా ఖర్చుపెట్టాలని అంటూవచ్చాం ప్రతి పైసా మంచికొరకు ఖర్చు పెట్టాలనే దృష్టి లేకపోయి నట్లయితే, మనం ప్రజలను మోసము చేసిన వాళ్ళమవుతాము ఇవ్వాళ నాలుగు లక్షల ఖర్చు అనేదే కాదు ఇదివరకు యీ మూడేళ్లనుంచి ఏ ఆశయం ఫలించ లేదు ? ఆ విషయం

తప్పకుండా చెప్పాల్సివున్నది తరువాత గౌరవనీయులైన లేబరు మంత్రిగారు social and cultural సంస్థలు రాజకీయ పార్టీ దృష్టితో రావడానికి యిబ్బందులున్నాయన్నారు మనం ఒక విషయం దృష్టిలో ఉంచుకోవాలి ఏ రాజకీయ పార్టీ ఏ రకంగా ఏ scale లో పెరుగుతున్నదో ఎందుకు మనం వాళ్లను ఆక్షేపించ లేక పోతున్నామో గుర్తించుకోవాలి వారికి ప్రత్యేక స్థానం కలుగ జేయడం మాత్రం ప్రజాస్వామ్యానికి ఒక విధమైన ఆటంకం కలుగ జేయడమే నరుకుంటున్నాను ఏ కారణం చేత ఆకర్షించడం లేదు ? సభానాయకులను మనం ఆకర్షించ లేకపోతున్నాము కాబట్టి యిక్కడ ఎగువ సభకు తీసుకుంటాం అంటున్నారు అంత పట్టుదల, ధీశక్తి, సామర్థ్యం కలిగిన ఏ సాంకేతిక నిపుణుడైనా సాంస్కృతిక ప్రవీణుడైనా 150 రూపాయలకు ఆశపడి రాడు ఎంతటి నిపుణునికైనా దేశసేవా తత్పరత ఉండాలి ప్రజలకు సేవ చేయాలనే అభిప్రాయం ఉంటే తప్ప 150 రూపాయలకు nominate చేసినంత మాత్రాన వచ్చి పని చేస్తాడనేటటువంటిది తెలివి తక్కువ అభిప్రాయము ఈ విషయంలో సరైన సలహాలనిస్తామనే సద్బుద్ధి కల నిపుణులను శాసనసభ్యులుగా ఎన్ను కుంటే యీ పంచాయతీయే ఉండదు ఇప్పటి శాసనసభ్యులలో కూడ నిపుణులు, విజ్ఞానం కలవారు లేక పోలేదు Research చేసిన వారనేకులున్నారు వారంతా ప్రజల దృష్టికి అనుకూలురా, లేదా అనేది ప్రశ్న ఏదియినా ప్రజల దృష్టిలో అనుకూలంగా వుందోలేదో చూడడానికి మూడువందలమంది సభ్యులము ఆంధ్రప్రదేశ్ శాసన సభలో వున్నాము ఒకరు కాకుంటే ఒకరు, వ్యవసాయంలో, విద్యలో, రోడ్ల సౌకర్యాలలో, engineering లో సలహా ఇ చెప్పగలిగినవారున్నారు ఈ సూత్రాన్నే మనం త్రోసివేయాలి ఆంధ్ర ప్రదేశ్ నిర్మాణం పెద్ద శ్రమతో జరిగింది

సక్రమమైన పద్ధతి మనం ఏమైనా అనుసరించి కేంద్ర ప్రభుత్వానికి పంపిస్తే వారు కూడా ఆలోచిస్తారు ఈ తీర్మానాన్ని ప్రతిపాదించినప్పుడే నేను గుర్తించాను మాకు 2/3 మెజార్టీ ఉన్నది ప్రతిపక్షం వారు చెప్పినదానికి,కాదు అనేది కాదు ప్రశ్న, ప్రజాస్వామ్యంలో మెజార్టీ ఉన్నదనే విషయమే కాకుండా మరొక విషయంకూడా ఆలోచించాలి మనం చేసేపనివల్ల దేశానికి దేశ భవిష్యత్తు కు ఏమంత మంచిదనే దృష్టితో కూడా ఆలోచించాలి కేవలం పార్టీ దృష్టితో మాకు మెజార్టీ ఉన్నది కాబట్టి తీర్మానం పాసవుతుందనే దృష్టితో వ్యవ హరిస్తే మనం ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని ఏ దృష్టితో adopt చేస్తామో దాని పునాది లేకుండా పోతుందని మనవి చేస్తున్నాను ఇదివరలో హైదరాబాదు ప్రభుత్వం ఇట వంటి ప్రయత్నం చేయలేదని కాదు చేసినది కాని సాగలేదు ఒక విషయం గౌరవ సభ్యుల దృష్టికి తీసుకురాదలుచుకున్నాను కవులుదారీ చట్టాలు tenancy act ఎన్నో చోట్ల జరిగాయి హైదరాబాదులోను జరిగినాయి కాని హైదరాబాదులో జరిగినది మిగతా రాష్ట్రాలలో కన్న ప్రోత్సాహకరంగాను అభివృద్ధికరంగాను ఉన్నాయి ఎందుచేత మనం బొంబాయిలోనో పంజాబులోనో మరెక్కడనో ఉన్న వాటిని గుడ్డిగా అనుసరింప లేదు ? పరిస్థితులు అట్లా లేవు ఇక్కడ వీలైనంతలోతుకు పోయి చేశాము రాజకీయ పక్షాలను దృష్టిలో పెట్టుకోకుండా ఎగువ సభ అనేది ప్రజలకు అవసరమా కాదా, ఇది లేకపోతే ప్రజలకు ఏమైనా ఇబ్బంది కలుగుతుందా, అనే దృష్టితో ఆలోచించి నిర్ణయం తీసుకోవాలని మనవి చేస్తున్నాను

దిగువ సభయు తీసుకున్న నిర్ణయాలను ఎగువ సభ రద్దు చేయడానికి అధికారాలున్నాయా లేదా అనే విషయమై నిన్ననే చర్చలు జరిగాయి గౌరవసభ్యులు, senior Advocate అను భవజ్ఞుడైన న్యాయవాది, శ్రీ ఎక్బోటేగారు చల్లగా జారుకున్నారు ప్రతి పక్షంవారు ప్రతిపక్షంగా ఉన్నారు కాబట్టి కాదు అంటున్నారేకాని ఇది, ఉండవలసిందే అన్నారు అంతే తప్ప ఈ ఎగువ సభ లేక పోవడంవల్ల ప్రజలకు ఏ విధమైన నష్టం కలిగింది, ప్రజల హక్కులు ఏ విధంగా నాశనం అయినాయి, అనే విషయం ఆయన ముచ్చటించ లేదు గౌరవనీయులైన కార్మిక మంత్రిగారు ప్రతిపక్షంవారు ప్రస్తుతానికి మాత్రం ఎగువసభవద్దు తరువాత కావాలని నిర్ణయం చేసుకొని ఇప్పుడు అవసరంలేదంటున్నట్లు భావించారు ఎగువసభ Upper House అనే ఉద్దేశమేతప్పు అని, ఎన్నికైన సభ్యులు ఇంతమంది ఉండగా నామినేటెడ్ సభ్యులు ఏదో వరగబెడతారని అనుకోవడం సక్రమమైన పద్ధతికాదని మనవి చేస్తూ ఈ తీర్మానాన్ని ఉపసంహరించి ఆంధ్రప్రదేశ్ కు మాత్రమేకాక ఇండియాలోనే మంచి ఆచరణ చేసిన వారం అనిపించుకోవాలని సభానాయకుని కోరుతున్నాను

श्री गोपीडी गगारेड्डि (निर्मल–जनरल) —स्पीकर सर। कल मै अपने नाम की चिट्टी लिखकर पेश किया था। आज वो साहब अपना नाम भिजवाये है अुनका नबर पहले आगया है। और मेरी बारी अब तक नही आओ। यह मै आपकी नोटिस मे लाना चाहता हूँ।

मिस्टर स्पीकर आपका टन भी आता है। సభ్యులకు ఒక మనవి ఇక నుంచి ౫ నిముషాలే ఒక్కొక్క సభ్యుడు మాట్లాడితే బాగుంటుంది చాలా మంది మాట్లాడ్డానికి అవకాశం ఉంటుంది ఈ విషయంలో సభ్యులు నాతో సహకరించాలని కోరుతున్నాను

శ్రీ జి శ్రీరాములు —అధ్యక్షా, సాధారణంగా మొదటి ఉపన్యాసకుల్ని గంటు కొలది, మాట్లాడటం, తుది ఉపన్యాసకులు వచ్చేసరికి అయిదు నిముషాలలో అంత మవుతుండడం జరుగుతూనేఉంటుంది అట్లా కాకుండా ఆదిలోనే ఉపన్యాసకుల ననుస రించి కాలమును విభాగించి అందరి ఉపన్యాసకులకు అవకాశం కల్పిస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను లేకపోతే మొదటి ఉపన్యాసకుడు గంటలకొలది మాట్లాడి రానురాను అయిదు నిముషాల (decreasing stage) లోనికి వచ్చేస్తుంది ఇదే విషయాన్ని నేను హైదరాబాదు అసెంబ్లీలో కూడా చెప్పియున్నాను తమరితో కూడా ఇప్పుడు మనవి చేసుకుంటున్నాను

మిస్టర్ స్పీకర్ —మాట్లాడవలసినవారు చాలా మందిఉన్నారు ఇంతవరకు పది నిముషాలు కాలము ఇస్తున్నాను అట్లాగే ఇస్తే కొంతమందిని వదలవలసిఉంటుంది సగం మంది మాత్రం మాట్లాడగలుగుతారు నిన్నటి పద్ధతినే అనుసరించడానికి నాకేమీ అభ్యంతరం లేదు తరువాత కొంతమంది మిగిలిపోయినారని మాత్రం అనుకోవద్దు

శ్రీ జి శ్రీరాములు — అధ్యక్షా, ఎంతకాలం వచ్చినా, ఆఖరుకు రెండు నిమిషాలు వచ్చినా ఫరవాలేదు ఉపన్యాసకులనుబట్టి కాలము పంచాలనే నేను చెప్పేది

మిస్టర్ స్పీకర్ —అది జరిగేదికాదు అట్లా ఉపన్యాసకులను తీసుకుని కాలాన్ని పంచితే 1½ నిమిషాలు వస్తుంది

శ్రీ లక్ష్మణ్ బాపూజీ కొండా (ఆసఫ్‌నగర్) —అధ్యక్షా, తక్కువ కాలం తీసుకునేవారికి మొదట అవకాశం ఇచ్చి ఎక్కువకాలం తీసుకునేవారికి తరవాత అవకాశం ఇస్తే బాగుంటుంది

మిస్టర్ స్పీకర్ —చూస్తాను

*శ్రీమతి శాంతాబాయ్ (మక్తల్—ఆత్మకూర్) — అధ్యక్షా, అధ్యక్షులవారు నిలబడి ఉండగా సభ్యులు లోనికి వస్తుండటం బైటికి పోతుండటం జరుగుతుందికో క్రమశిక్షణకు భంగంగా ఉంటుంది అధ్యక్షులు నిలబడిఉండగా పుల్లారెడ్డిగారు నిలబడి ఉండడం జరుగుతోంది ఇది క్రమశిక్షణకు భంగం మేము నాలుగు సంవత్సరాలనుండి హైదరాబాదులో అనుసరిస్తున్న పద్ధతి ప్రకారం అధ్యక్షులవారు కఠినఉత్తరువులు చేయాలనికోరుతున్నాను నిన్నటి నుంచి ఇదే ప్రకారం జరుగుతోంది అందుచేత ఆ ప్రకారం లేచినిలబడడం కూడదని కఠిన వుత్తరువులు ఇవ్వాలని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ —గౌరవ సభ్యురాలుచెప్పిన విషయం నిజమే అధ్యక్షులు నిలిచినప్పుడు కొంచెం ఆగి వారు కూర్చున్న తరువాత రావడం మంచిది

*శ్రీ జి నరసింహామూర్తి (అమలాపురం—జనరల్) —అధ్యక్షా, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి ఎగువ సభ కావాలని ముఖ్యమంత్రిగారు తెచ్చిన తీర్మానంపై పలువురు గౌరవ సభ్యులు మాట్లాడుతూ కొందరు అటువంటి ఎగువసభ అవసరమని మరికొందరు అటువంటిది అవసరం లేదని చెప్పడం జరిగింది కాని మనరాష్ట్రానికి ఎగువ సభ అవసరమని నా అభిప్రాయమైయున్నది ఎగువసభ ఏర్పాటు చేయడంవల్ల మన రాష్ట్రానికి చాలా ఉపయుక్తంగా ఉంటుందని మనవి చేస్తున్నాను ఈ సందర్భమున వచ్చిన విమర్శలలో ఈ ఎగువ సభవల్ల అధిక వ్యయం తప్ప వేరే ప్రయోజనం వుండదని అటువంటి వ్యయానికి రాష్ట్ర ప్రభుత్వాన్ని లోనుచేయడం మంచిది కాదని, ప్రజల దగ్గరనుంచి ఎంతెంతగానోవసూలు చేసే డబ్బును ప్రజోపయోగకరంగా వినియోగపరచవలెగాని ఇటువంటివాటికై కాదని చెప్పడం వింటున్నాము శాసనసభ్యుల ఎక్కువమంది ఉండడంవల్ల రాష్ట్రాదాయములో కొంత ఖర్చు అయినప్పటికి దానివల్ల ప్రభుత్వం బలపడి ప్రజానీకానికి క్షేమాన్ని సమకూర్చే అవకాశం వస్తుందికాని మరొకటికాదు మనం అనేక ప్రణాళికలను అమలు చేసి దేశానికి సత్వర అభివృద్ధి కలిగించాలని ప్రయత్నిస్తున్నాము ఈ కృషిలో అనేకసాంకేతిక రంగాలలో ప్రవీణులైన పెద్దల సహాయ సహకారాలు మనకు అవసరం వీరికో చాలామంది శాసనసభ ఎన్నికలలో పాల్గొని శ్రమ పడడానికి ఇష్టం లేక బయటనే వుండి పోతుంటారు అటువంటి వారిని శాసనసభ ఎన్నికల ద్వారా కాక మరొక నిర్ణీత పద్ధతిలో నియోజక వర్గాలను ఏర్పాటు చేసి వారికి శ్రమ లేకుండా తీసుకువస్తే వారి సామర్థ్యాన్ని ప్రభుత్వం ప్రజాక్షేమానికి ఉపయోగించ కోవచ్చును ఇటువంటి ఉద్దేశంతో తీసుకు వచ్చిన ఈ తీర్మానం ప్రశంసనీయమైనదనిమనవి చేస్తున్నాను సాంకేతిక నిపుణుల సహాయ సంపదలతో దేశ ఆర్థిక స్థోమతను కోట్లాదిగా అధికం చేసేనప్పుడు కొన్ని లక్షల రూపాయలు ఖర్చు చేయడానికి సంకోచించవలసిన పనిలేదని ఈ తీర్మానం మన అవసరాలకు అనుగుణంగా ఉన్నది కనుక బలపరుస్తూ నేను విరమిస్తున్నాను

శ్రీ గోపిడి గంగారెడ్డి అధ్యక్షా, నేను నిన్న చీటీ ఇచ్చినాను. ఆ చీటీ దయచేసి చూస్తా రని నేను ప్రార్థిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ సరే చూస్తాను

*శ్రీ జి శ్రీరాములు అధ్యక్ష మహాశయా, నేడు ఎగువసభ కావాలా, వద్దా, అనేది చర్చనీయాంశమైపోయింది Legislative Assembly కి elect కాకముందు అన్ని పనులు చేసేస్తాం అని, మనం యోగ్యులమని, అన్ని గొప్ప కార్యాలు Legislation ద్వారా దేశానికి కావలసిన అవసరాలు, అన్నికూడా పూర్తిచేస్తామని, అనుకొన్న వాళ్ళలో నేను ఒకడిని కాని, elections అయిన తర్వాత వచ్చినటువంటి మెంబర్ను, ఏర్పడినటువంటి శాసనసభయు వాటియొక్క పంథా, ఎసెంబ్లిలో వున్నటువంటి సభ్యులయొక్క ప్రవీణత, యివన్ని చూచినతర్వాత మనం చేసేటటువంటి Legislation విషయమై కాలయాపన కాకుండా ఆ ౮ లక్షలో, ౧౦ లక్షలో యింకా ఎంత ఖర్చు అయినా Opposition Members యొక్క అభీష్టాన్ని తీర్చటానికి ఎగువసభ తప్పకుండా వుండాలనేటటువంటి ఖచ్చితమైన నిర్ణయానికి వచ్చినవారిలో నేను ఒకడిని

Legislation మీదే గవర్నమెంటు ఆధారపడి వుంది Legislation అనే work కఠినమైనది అటువంటి విషయాలమీద నేను ఎక్కువగా పార్టీ చిక్కులలోనికి పోయేవాడిని కాదు కనుక ఈ విషయం మీద నేను క్లుప్తముగా నా ఉపన్యాసాన్ని పరిమితంచేసి మాట్లాడదలచుకొన్నాను

Legislation ఎంత కష్టమైనదో వివరించటానికి, Jurisprudence వ్రాసినటువంటి జాన్ ఆస్టిన్‌గారి రచన ఒకటి మీముందు పెడతాను

"I will venture to affirm that what is commonly called the technical part of legislation is incomparably more difficult than what may be styled the ethical In other words, it is far easier to conceive justly what would be useful law, than so to construct the same law that it may accomplish the design of the law giver"

ఈ విధంగా కష్టమైనటువంటి Leg slation మీద, ప్రభుత్వము ఇటువంటి Legislat ve body మీద ఏవిధంగా ఆధారపడి వుంటుందో చెప్పటానికి రాబర్ట్సు ఎన్ కుక్ వ్రాసిన పుస్తకమునుండి కూడా ఒక రచన మీముందు పెట్టదలచుకన్నాను

"Sound Government depends upon legislation that says the right thing in the right way, in a language that is as clear, simple and accessible as possible There must be draftsmen who can provide these things with the least friction and delay"

ఈ విధంగా ఏర్పడినటువంటి అసెంబ్లీపైన గవర్నమెంటు ఆధారపడి వుంది కనుక Legislative Assembliesను చాలా ఉన్నతస్థాయిలో, Legislation చేయుటకు చాలా దక్షత కలిగిన వారితో కూడుకొని వుండాలని నేను అతిశయోక్తిగా చెప్పటంలేదని మనవి చేస్తున్నాను ఆ తరువాత మన Legislatures అన్నిటిని వదిలేస్తారని యిప్పుడు ఒక Opposition Member చెప్పారు దానిమీద వ్యాఖ్యానిస్తూ రాబర్ట్సన్ ఈ విధంగా అన్నారు

" It is believed that no real improvement in the qualitiy of our statutes can be hoped for until our legislators and others responsible for the preparation and passage of bills realize that all the processes involved in converting a meritorious idea into an effective State are equally important and that in each process experts must be employed "

Leg slative Assemblies లో మనయొక్క ideas ను ఖచ్చితంగా ఒక స్థాయిలో చెప్పగలమని, మనంతట మనం గౌరవించుకోవటంగాని, గర్వపడటంగాని, కష్ట పరిస్థితులలో సరియైనది కాదని Oppsition Membeis లో నేను మనవి చేసుకొంటున్నాను Upper House కావాలని Upper House కు వచ్చే పెద్దలందరిచేత ముద్రపడాలన్నట్లయితే మన గౌరవానికి, ప్రతిష్టకు భంగం కల్గుతుంది అని, మనలను వారు చులకనగా చూస్తున్నట్లవుతుందని Oppos tion Members ఒకరు అన్నారు అయితే వాస్తవిక విషయాలను చెప్పకపోవటం, అంటే వాస్తవ విషయములకు దూరంగా పోతూ మనయొక్క నిజస్వరూపాన్ని బైట పెట్టుకోవటం, మనయొక్క ఆత్మలో వుండే టటువంటి దౌర్బల్యమేనని మీముందు చెబుతున్నాను మనం repiesentatives గా ఎన్నుకొన్నవారమని తెలుసు అక్కడి facts, situations కావాలంటే గంభీరంగా ఉపన్యాసాలు చెప్పవచ్చు అక్కడ ఈ విధంగా వరదలు వచ్చి పంటలు కొట్టుకపోయాయి, ౨౦౦ మంది హరిజనుల ఇండ్లు కొట్టుకు పోయాయి, వాళ్ళు అన్నం లేక మల మల మాడిపోతున్నారు, కనుక సప్లయి చేయవలసిందిగా గట్టిగా minister గారికి representation చేస్తాము దేశానికి అవసరమైనటువంటి Soc a'istic patren of society ని దేశంలోకి తీసుకురావటానికి సరైన Legislation రావాలంటే మాత్రం మనమందరం ఒక చోటికి చేరవచ్చు మనలో కొంతమందికి, అర్థం చేసుకోలేనటువంటి వారికి Legis'atures సరైన అందుబాటులో లేవని నేను చెప్పవలసి వస్తుంది దానిని వారంతా ఒప్పుకొంటే మనకువచ్చే ఆపత్తు, అపవాదు ఏమి లేదని మనవి చేస్తున్నాను Legislatives కు election లో సరైన విధానాల లో members ను ఎన్నుకోటానికి వారి అర్హత గురించి principles గురించి ఏమైనా rules వున్నప్పుడు Upper House వద్దని చెప్పవచ్చునేమో కాని, ప్రస్తుత పరిస్థితులలో, ఎవరైనా రావచ్చు అనేటటువంటి సమయంలో Upper House అక్కర లేదనడం బాగుగా లేదు ఎవరిమీద అయితే ప్రజలకు

విశ్వాసం వుందో వారినే పంపించ వచ్చు ఒక మహాత రమైనటువంటి ప్రజ్ఞాకలవారి సలహాలను పొందటానికి యింకో House పెట్టటంలో తప్పు లేదని తమతో నేను మనవి చేస్తున్నాను

ఇంతవరకు చేసినటువంటి శాసనాలు, ముఖ్యంగా తెలంగాణాలో జరిగినటువంటి "ఆసఫ్‌జాహి ఖాందాన్" లో వున్న శాసనాలను చూసినట్లయితే కుప్పలు కుప్పలుగా పడి వున్నాయి List of laws enacted by the Hyderabad Assembly లో చూసేఉంటారు ఇదంతా చూసినట్లయితే ఒక సంవత్సరం లోపున S R Act ప్రకారము దానిని adopt చేయుటమో modify చేయుటమో, చేయవలసి వున్నది అటువంటి పరిస్థితులలో ఏదితెస్తే బాగుంటుంది, ఏది repeal చేస్తే బాగుంటుంది ? దానియొక్క result ఇదివరకు వున్నటువంటి act మీద ఏవిధంగా వుంటుంది, supersede అవుతుందా ? Repeal అవుతుందా ? అనే దానిమీద బాగా ఆలోచించి నిర్ణయాలు చేయాలి వీటన్నింటి గురించి మనం తత్తరపడి ఎన్నోచేసి వుంటాము, చేశాము ఒక నిమిషము లో మంత్రి శ్రీ వి బి రాజుగారు (సెకిందరాబాదుసభ్యుడు) చెప్పినటుగా ర, › bills ఏమాత్రం ఆక్షేపణ లేకుండా pass అయినాయి చాలా అవసరమైనటువంటి యోగ్యమయినటువంటి వాటికి, Opposition Members యింకా time కావాలి అంటారు అట్టి వాటిమీద [illegible] amendments ఇచ్చి ఆర్య రోజులు తీసుకొన్నసమయాలు కూడా వున్నాయి ఈ విధంగా ఎన్నో సమయాలుతీసుకున్నా, మనం సరైన విధానం జేయకుండా వున్నామని నేను చెబుతున్నాను ఒకసారి ఒక మెంబర్ ఏ విధంగా ఎంత తొందరగా pass చేస్తామె అనే విషయంపై ఈ విధంగా criticise చేశారు

" A Benthamite once complained that Parliament passes statutes by wagon loads and repeals them by cart loads"

ఈ విధంగా, తొందరగా "వాగన్ లోడ్" గా మనం pass చేస్తూ వుంటాము, cart loads గా repeal చేస్తూ వుంటాము, అని దానిమీద ఒక విధమైన విమర్శ చేశారు

" It may be well to warn the draftsman that in his case virtue, will, for the most part be its own reward, and that after all the pains that have been bestowed on the preparation of a Bill, every Lycurgus and Solon sitting on the back benches will denounce it as a crude and undigested measure, a monument of ignorance and stupidity Moreover, when the Bill has become law, it will have to run the nogatlet of the judicial bench, whose ermined dignitaries delight in pointing out the shortcomings of the legislature in approving such an imperfect performance "

ఈ విధంగా ఎన్నో pass చేసి High Court దాకా పెళ్ళి, రిట్‌ద్వారా *Ultra Vires* అని అనిపించుకున్న ఎన్నో Legislations కూడా

ఉన్నాయి అందుకు వుదాహారణలు hon Members from Chaderghat & Sec'bad, Constituencies తమ ముందు పెట్టారు అటువంటి పరిస్థితులు కలుగచేసి, డబ్బు అంతానష్టం చేసినటువంటివారము ఔ తున్నాము ౨, ౩ లక్షల డబ్బు పెట్టి, ఎగువ సభ పెట్టు కాని దక్షత కలవారిని, ప్రజ్ఞ కలవారిని consult చేస్తే తప్పు ఏమీ లేదు

ఎగువసభకు గూడా కొన్ని నియమాలు కొన్ని మార్పులు ఉంటే బాగుంటుంది అసెంబ్లీ వారు ఎగువసభకు పంపిన శాసనములు అక్కడ వారు చూడడం, ఆమోదించకపోతే తిరిగి అసెంబ్లీకి పున పరిశీలనకు త్రిప్పి పంపడం, అవి తిరిగి ఎసెంబ్లీలో పరిశీలించి మరల ఎగువసభకు పంపడం, అది వారు final గా ఆమోదించడం జరుగుతున్నది ఈ విధంగాచేసేదానికంటె ముందుగా ఎగువసభవారిని consult చేసి, అసెంబ్లీలో చర్చించి పంపడములోతప్పేమీ లేదు అసెంబ్లీలో శాసనములు చర్చకు రాకముందు ఎగువసభ వారిని Sub-committee గా ఏర్పాటుచేసి, వారి తీర్మానాలను అభిప్రాయములను ఎసెంబ్లీలో చర్చించి పంపితే బాగా ఉంటుంది అంతే కాని యిప్పుడుజరిగే విధానములబదులు, యిన్నిసార్లపైకిపోయి, తిరిగి వచ్చేబదులు, ఒకేసారిగా కౌన్సిలువారి Sub-committee అభిప్రాయములు ముందుగా అసెంబ్లీలో చర్చించిపంపితే మంచిదని చెప్పేవారిలో నేను ఒకణ్ణి ఉదాహారణకు హైదరాబాదు Tenancy Act ను గురించి చెబుతున్నాను ఈ బిల్లు మొదట అసెంబ్లీలో చర్చకువచ్చినప్పుడు నాలుగు సవరణలువచ్చినవి ఆ సవరణలు చర్చించటానికి నాలుగు దినములు అనుకున్నారు ఈ విధముగా చర్చించడము అనవసరమని నా అభిప్రాయము పైగా నాలుగుదినములకు ఖర్చు ఎంతఅయిఉంటుందో గూడ గుర్తించాలి ఈ విధముగా అనవసరపు చర్చలు చాలా జరుగుతూవచ్చినవి ఈ విధముగా నాలుగేసిరోజులు చర్చించి అనవసరముగా డబ్బు ఖర్చుచేసేబదులు, ఒకేసారి amendments ఏవీ రాకుండా వుండుగానే ఎగువ సభలోనివారిని Sub-committee గా ఏర్పాటుచేసి, వారి అభిప్రాయములు తీసుకుని అసెంబ్లీలో ఒకే పర్యాయము ప్యాసుచేసి పంపితే, కాలయాపన, ఖర్చుగూడ ఉండదు ఆ విధముగాచేస్తే అసెంబ్లీ ముందువచ్చే శాసనములు సంపూర్ణ శాసనములుగాఉంటాయి అంతేగాని తెలిసినవి తెలియనివి amendments తెచ్చి, అనవసరముగా నాలుగేసిరోజులు, ఆరేసి రోజులు చర్చిస్తే, కాలయాపనచేయడమవుతున్నది ఈ విధముగా జరిగిన ఖర్చు అంతా లెక్కవేసి చూస్తే, సుమారు ఆ యాక్టుకుగాను ౭౬ వేల రూపాయలు ఖర్చు అయి ఉంటుంది ఇదే విధముగా Sales Tax Act చర్చించిన సందర్భములో ౧౫, ౧౬ సవరణలు వచ్చినవి దీనికి ఎంత డబ్బు ఖర్చు అయిఉంటుందో గుర్తించాలి ఇది గాక Non-official days కావాలని కోరుతూవచ్చారు Opposition Party వారు తమకు majority లేకపోయినప్పటికినీ, No confidence motion తేవడము అది ౪, ౫ రోజులు చర్చించడము, చివరకు అది వీగిపోవడము జరిగింది ఏదో noconfidence motion తెచ్చాము, చర్చించాము అని సంతోషించడమేగాని, దానికి లక్షలకొలది డబ్బు ఖర్చుచేయడము జరిగింది ఇలాంటి అనవసరపు ఖర్చులు కాకుండా చూడాలి ఒకవేళ అటువంటివి ఏవైనా motions తీసుకొని వదలిస్తే, వాటికొరకు ఏ రెండు, మూడు లక్షలో కేటాయించి అందుకు ఉపయోగపరచుకుంటే

అన్ని విధములా సౌకర్యముగా ఉంటుంది ఇది వారి ఆదర్శ ప్రకారము చేసుకుంటే, అందులో తప్పేమీ లేదు అని చెప్పేవారిలో నేను ఒకణ్ణి కాబట్టి మనకు ఎగువసభ అక్కరలేదని వాదించడము సమంజసము కాదు ఎగువసభ ఉండడమువల్ల, అది వాస్తవికముగా మనకు ఉపయోగమే కాని, అనుపయోగమని ఎవరూ చెప్పజాలరు మన రాష్ట్ర పరిస్థితులనుబట్టి ఎగువసభను ఏర్పాటుచేసుకోవడమువల్ల మనకు లాభదాయకమే గాని, నష్టదాయకము కాదు కాబట్టి ఎగువసభ అక్కరలేదని చెప్పడము మంచిదికాదు సభ్యులెవ్వైన మనము యిప్పుడు ఏ విధంగా Legislation జరుపుకుంటున్నామో, అదే విధముగా మన యొక్క యోగ్యతలు, అర్హతల దృష్టిలో పెట్టుకుని, Legislation జరుపుకోవచ్చు అంటే మనము ప్రజల విశ్వాసము కలవారము గనుక అనవసరమైన amendments తీసుకొనివచ్చి కాలయాపన, ఖర్చుచేయకుండా ఏ శాసనమువచ్చినా, దానిని సంపూర్ణముగా ఆలోచించి ప్యాసు చేస్తే మంచిది అవి మంచిరూపములో రూపొందించటానికి వీలు అవుతుంది ఆ విధంగా కోరేవారిలో నేను ఒకణ్ణి అసెంబ్లీ క్రింద అనవసర కాలయాపనవల్ల ఎట్లాగో లక్షల కొలది డబ్బు ఖర్చుచేస్తూనేవున్నాము అటువంటి ద్రవ్యమును కొంత సేకరించి యీ ఎగువ సభకు ఖర్చుచేయడములో తప్పేమీలేదు అప్పుడు ఆ ద్రవ్యము సద్వినియోగము చేసినట్లు అవుతుంది అంతే కాని Opposition Party వారు ప్రజానీకమువద్దకు పోయి, యింకా ఎక్కువమంది మెంబర్లు కావాలని ప్రచారముచేసే బదులు, ఎగువసభ ద్వారా కొంతమందిని మెంబర్లను తెచ్చుకుని వారి సలహాలుకూడ పొంది శాసనములుచేయడము మంచిది ఇంకనూ కొంతమందికి యీ సభలో పనిచేయుటానికి అవకాశము యిస్తే తప్పేమిలేదు ఈ సభవల్ల రాష్ట్రములోని మేధావంతులు ఎగువసభకు రావటానికి, వారి యొక్క అభిప్రాయములను తెలుసుకోటానికి అవకాశము కలుగజేసుకుంటే, మన యొక్క దక్షత, బుద్ధి కుశలత పెంపొందింప జేసుకోవచ్చునని గూడ నా అభిప్రాయము ప్రజలుకూడ మనయందు విశ్వాసము వహించి యుండటానికి గూడ అవకాశము కలుగుతుంది కాబట్టి యీనాడు ఎగువసభకొరకు ప్రభుత్వము వారు ప్రవేశపెట్టిన తీర్మానమును బలపరచి ఆమోదించటానికి ఏమాత్రము సంకోచింపక దీనిని బలపరచి ప్యాసుచేయాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను

*శ్రీ గోపిడి గంగారెడ్డి అధ్యక్షా, ఈనాడు మన రాష్ట్రమునకు ఎగువ సభను గురించి సభలో చర్చజరుగుతున్నది నేనుగూడ కొన్ని విషయములు మనవి చేయదలచుకున్నాను ఎగువ సభలో కొంతమందిని కళాకారులను, మేధా శక్తిగలవారిని, ప్రతిభావంతులను, బుద్ధిమంతులను మెంబర్లుగా చేర్చి, వారిని ప్రభుత్వానికి సలహాదార్లుగా యీ ఎగువసభను ఏర్పాటు చేయాలని తీర్మానము తెచ్చారు అయితే నేను ఒక్క విషయము అడుగుతున్నాను ఎగువ సభ విషయములో ఏమి జరుగుతున్నదీ మనకు తెలియకపోలేదు చెప్పేది ఒకటి, చేసేది మరొకటి తప్ప మరేమి కనపడదు మొదటి విషయము ఏమంటే, మనకు ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరవాత మనము చేయబోయేది అంతా ఆంధ్రములోనే ఉంటుందని ఆశించాము మనమందరము ఆంధ్రులమవుతామని అనుకున్నాము కాని యిప్పుడు మాట్లాడే మాటలు మాత్రము యిక్కడ ఆంధ్రములో ఉన్ననూ, వ్రాత మూలముగా జరిగే కార్యక్రమమంతా జూస్తే, ఆంగ్లములోనే ఉన్నది ఆంధ్ర దేశములో ఉన్న వారు ఆంగ్లము అనే అద్దము పెట్టుకుని చూస్తే, అంతా ఆంగ్లముగా

కనబడుతుంది ఆంగ్లము అనే అర్ధము కాకుండా ఆంధ్ర అనే అర్ధము పెట్టుకుంటే, అంతా ఆంధ్రము అవుతుంది అందువల్ల మనకు ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత గూడ యింకా ఆంగ్లము ఎందుకు ఉపయోగిస్తున్నారో నాకు అర్థము కావడము లేదు

ఇక రెండవ విషయమేమిటంటే ఎగువ సభను గురించి మాట్లాడేటప్పుడు ప్రభుత్వము వారు ౭౨ మంది మేధావంతులతోనూ, కళాకారులతోనూ, ఎగువ సభను ఏర్పాటు చేసి వారివారి అభిప్రాయములు, శాసనముల విషయములో తీసుకుంటే బాగుంటుంది గనుక దానిని ఏర్పాటు చేయాలని, అందుకు ఏ నాలుగు లక్షలో ఖర్చు అవుతుందనీ అన్నారు అయితే ప్రజలచేత ఎన్నుకోబడని వారిని తెచ్చే బదులు, యింకను దానికి ఖర్చు చేసే బదులు, యీ ౭౨ మందిని యీ అసెంబ్లీ మెంబర్లనుంచి యెందుకు కేటాయించగూడదు! అయితే ఎలెక్షనుల కొరకు ఏవేవో పార్టీలు ఏర్పడినవి ఒక్కొక్క పార్టీవారు తమయొక్క పార్టీ మనుష్యులకు టిక్కెట్టు యిచ్చేటప్పుడు, వారు యిచ్చే టిక్కెట్లు కళాకారులకు, మేధా శక్తిగలవారికి, బుద్ధిమంతులకు, వగైరాలకు యిచ్చివుంటే, వాళ్లు ఈ అసెంబ్లీకి వచ్చియుండే వారు గదా! ఆ విధముగా చేస్తే, యీ ఎగువ సభలో అవసరము లేక పోయేదిగదా? తెలంగాణా జిల్లాలలో ఎలెక్షన్లు జరగబోతున్నవి అందుకు ప్రతి పార్టీవారు గూడ తమ పార్టీవారికి టిక్కెట్లు యివ్వబోతారుగదా! ఆ యిచ్చేవారిలో యిటువంటి మేధావంతులకు, కళాకారులు వగైరాలకు మొత్తము మీద ప్రభుత్వానికి కావలసిన ౭౨ మందికి యిప్పించేటట్లు చూసారా! ఆ విధముగా చేస్తే ప్రభుత్వము కోరే మేధావులు, కళాకారులు వగైరాల కొరకు ప్రత్యేకంగా సభ అనవసరమవుతుందిగదా పైగా దానికిగాను ఖర్చుగూడ ఉండదుగదా! పార్టీ టిక్కెట్లు యిచ్చే దాత ఎలెక్షనులలో నిలబడకూడదు అని ఉన్నది ఇప్పుడు పార్టీ బానిసత్వం జరుగుతున్నది ఇదివరకు ప్రభుత్వ బానిసత్వము ఉన్నది దీనిని బట్టి చూస్తే, మనకు పూర్తి స్వాతంత్ర్యము రాలేదన్న విషయం బోధ పడుతుంది కాబట్టి ఏ పార్టీవారు అయితే ఎవరెవరికి టిక్కెట్లు యివ్వదలచుకున్నారో, వారిలో కళాకారులను, మేధా శక్తిపరులను, వగైరాలను ఏరి, టిక్కెట్లు యిప్పించి, ప్రజల విశ్వాసము పొందినవారిని శాసన సభలోనికి తెప్పించినట్లైతే ప్రభుత్వము కోరే ౭౨ మంది రావటానికి వీలు అవుతుంది కాబట్టి ప్రభుత్వమువారు ఆ విధంగా చేస్తారా? దీనికి ముఖ్యమంత్రిగారు ఏమని సమాధానము చెబుతారని అడుగుతున్నాను దీనికి వారి అభిప్రాయము ఏమిటో చెప్పమని విజ్ఞప్తి చేస్తున్నాను ఏదో సలహాదార్లు కావాలి, సలహాదార్లుకావాలి అని అంటున్నారు నిజమే, ఎగువసభలోకి వచ్చే బదులు యీ శాసన సభలోకేవస్తారు గదా! కాబట్టి శాసన సభకు రానున్న మెంబర్లలో నుంచి, యీ ౭౨ మందిని కేటాయిస్తారా అని అడుగుతున్నాను త్వరలోనే ఎన్నికలు రాబోతున్నవి వారిని యిప్పుడే select చేసి ఎలెక్షనులో నిలబెట్టించండి హైదరాబాదు రాష్ట్రములో డాక్టరు చెన్నారెడ్డిగారు, డాక్టరు మేల్కోటేగారు మంత్రులుగా ఉన్నారు వీరు యిద్దరు వైద్య శాస్త్రము చదివినవారే అయితే ప్రభుత్వముయొక్క వైద్య శాఖకు వీరిద్దరిలో ఎవరినీ గూడ మంత్రిగా ఎందుకు వేయలేదు? ఇలాంటిది ఎందువల్ల జరిగింది? **बोली रहमान की चाल शैतान की** అనే పుస్తకము ఉన్నది అందుకే యిటువంటి లోపములు కనబడుతున్నవి అనుభవముగలవారిని ప్రభుత్వము కోరుతున్నది ఇప్పుడు అలోపతి, హోమియోపతి, ఆయుర్వేదము అని మూడు విధములైన వైద్యములుండగా, యింకొకటి

ప్రకృతి వైద్యము అని బయలు దేరింది దానికి మందులు అవసరము లేదట అటువంటి శాఖకు సహాదార్లు కావాలంటే, యిక యీ మాదిరిగా అన్నింటికి సలహాదార్లు కావాలంటే, ఒక్కొక్క శాఖకు ఎంతమంది కావాలో చూడాల్సి ఉన్నది ఈ శాఖలన్నిటికి ఎంతమందో మంత్రులు కూడ కావాలన్నట్లేఉంది ఇదివరే బందిపోటు దొంగతనము కూడ మేధాశక్తిలో చేరినదే మేధాశక్తి ఉంటేగాని బందిపోటు దొంగతనము చేయలేడుగదా! దీనిని అణచి వేయటానికి గూడ, బందిపోటు దొంగతనము తెలిసినవారిని, అందులో బాగా ప్రవీణత పొందినవారిని, వారిని గూడ యిందులో వేయడం అవసరమేగదా ఇక వారిని గూడ ఏరి తీసుకుని రావలసిందేగదా! బందిపోటు దొంగతనమును తగ్గించటానికి గూడ ఒకరు అవసరమేగదా! గుత్తేదారుగా ఉండే వారు ఎన్నికలలోకి రావటానికి వీలుకాదని ఒక సిద్ధాంతం ఉన్నది కాబట్టి యీ గుత్తేదార్లు కూడ అనుభవముగల వారే కాబట్టి వారిని కూడ కౌన్సిలులోనికి తీసుకోవచ్చుననుకుంటాను వారినికూడ లెక్కలోకి తీసుకుంటారా ? అదికూడ తగ్గిపోతుంది కాబట్టి ప్రభుత్వము యిప్పుడు ఎగువ సభకొరకు చెబుతున్న మాటలు, తీరా, practice లోనికి వచ్చేటప్పటికి జరుపుతారా అన్న సందేహము కలుగుతున్నది गेहु बताना जवार बेचना అంటే గోధుమలు చూపించి, జవ్వార్ అమ్మటంగా జరుగుతున్నది అంతకు తప్ప వేరేమీ జరగదు అందువల్ల మనస్సు, వాక్కు, చేత, ఈ మూడు సత్యములు కనబడుతున్నవి "సత్యమేవ జయతే" అన్నట్లు, మనకు ప్రభుత్వము చూపించేది మాత్రము చక్కగానే కనబడుతుంది

Health day celebrations అని చేయిస్తున్నారు అంటే ప్రజల ఆరోగ్యముకొరకు Health Day celebrate చేయాలట ఇవి చేస్తున్నప్పటినుంచి ప్రజలు ఎంత ఆరోగ్యముగా ఉన్నారో మనకు తెలుసు తరువాత వనమహోత్సవములు జరపాలన్నారు అంటే ఎక్కడెక్కడైతే అవసరమో, అక్కడ చెట్లు క్రింద చెట్లుపెట్టి ఉత్సవాలు చేయమంటున్నారు అలాగైతే మా ఆదిలాబాదు జిల్లా చాలా అడవి ప్రదేశము అక్కడ చెట్లు చాలా ఉన్నవి అక్కడ కూడ వనమహోత్సవము చేయమని సర్క్యులరు జారీచేస్తే, అక్కడకూడ చెట్లుక్రింద చెట్లు పెట్టవచ్చు నిజానికి చెట్లు ఎక్కడ అవసరమో ఎక్కడ అనవసరమో ప్రభుత్వము సరిగా ఆలోచించక పోవడము జరుగుతున్నది కానినేను అనుకున్న ప్రకారము ఎవరైనా తన గుండె మీద చేయివేసి చూచుకుని పరీక్ష చేస్తే, తనక్క నిజస్థితి బైట పడుతుందని తెలుసుకోగలుగుతాడు

चोरो की चोरी का खुद चेहरे से पता लगता है, गवाह से कोअी पता नही लगेगा ।

అదే విధముగా యీ ఎగువ సభనుగురించి మనము ఎప్పుడైతే మాట్లాడుతున్నామో నిజస్థితి తన ముఖములోనె సాక్షీభూతముగా కనబడుతుంది ప్రభుత్వము చెప్పేదానిని బట్టి చూస్తే, ఇది యేదో మాలో అల్లకల్లోలాలు, తగాదాలు రాకుండా, మాపార్టీనిబలపరుచుకోటానికి యీ విధముగా చేస్తున్నాము అని చెబుతున్నట్లు కనబడుతున్నది ప్రభుత్వానికి మేధాశక్తి గలవారు, కళాకారులు కావాలంటే, యీ శాసన సభకే వారిని ఎందుకు వచ్చేటట్లు చేసుకోరాదు ? పైగా సర్కారు ఉద్యోగములోనుంచి తీసివేసిన వారిని ఎన్నికలలో ఓడిపోయిన వారిని, యీ సభద్వారా అవకాశము యివ్వాలన్నట్లుగా ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యముగా కనబడుతున్నది అటువంటివారిని, బ్రతుకు తెరువు లేనివారిని పోషించటానికి తప్ప, యిది నిజముగా ప్రజలకోసము ఏర్పాటు చేసే సభలా కన్పించడము లేదు అది తప్ప మరేమీకాదు

సర్కారు ఉద్యోగుల విషయం చూడండి తమ ఉద్యోగములను సక్రమంగా నిర్వహించక పోతే, తీసివేయబడినట్టి వారిని కూడా కౌన్సిల్‌లోనికి తీసుకోడానికి అవకాశమున్నదట హైదరాబాదు ఎన్నికలు అయిన తరువాత ఎంతమంది సలహాదారులున్నారో చూడండి ౭౨ మంది సభ్యులతో కౌన్సిల్ ఏర్పాటు చేయడం నాకు సమ్మతంకాదు అనేకమంది సలహాదారులుంటారు ఈ శాసనసభలో తెలివి కలవారు, గొప్ప అనుభవజ్ఞులు ఉండగా మళ్లా వేరే సభ ఎందుకు ? ఇప్పుడు తెలంగాణాకు ఎన్నికలు కాబోతున్నాయి ఎన్నికలు అయినతరువాత ఈ విషయాన్ని చర్చకు తీసుకువస్తే బాగుంటుందనుకొంటున్నాను ఈ తీర్మానాన్ని ఉపసంహరించుకోవలసినదిగా ముఖ్యమంత్రిగారికి మనవిచేయుచున్నాను

శ్రీ సి హెచ్ వెంకటరామారావు (కరీంనగర్) అధ్యక్షా ! ఎగువ శాసనసభ కావాలా ? అక్కరలేదా అనే విషయమై నిన్నటి నుంచి చర్చ జరుగుతున్నది ముఖ్యమంత్రిగారు కొన్ని వాదనలుచేశారు వారికి తగిన సమాధానం దొరికిన తరువాత మళ్లా రెండవ సభ కావాలంటున్నారు హైదరాబాదు మాజీ మంత్రులు, ఇతర మంత్రులు కూడా ఎగువసభ కావాలని క్రొత్త క్రొత్త వాదనలు తీసుకువస్తున్నారు శ్రీయుత ఎక్బోటేగారు హైదరాబాదు హైకోర్టులో తెలివిగల Pleader గారు వారు ఎగువ శాసనసభ ఒక Legal Depaıtment గా వుంటే బాగుంటుందన్నట్లుగా తమ ఉపన్యాసములో తెలియజేశారు (అంటే Department గా కాదనుకోండి) మనం తొందరగా చేసే శాసనాలలో చాలా తప్పులు ఉంటాయి ఆ తప్పులను సరిదిద్దుకొనుటకూ, అవసరమైన మార్పులనుచేసుకోడానికి అవకాశం ఉంటుందనే దృష్టితో ఉపన్యసించారు

మాజీ ఉపమంత్రి శ్రీయుత రాజలింగంగారు Second Five-Year Plan ను implement చేయడానికి, ప్రజలలో ఎక్కువ ఉత్సాహాన్ని కల్పించడానికి ఎగువ శాసనసభ అవసరమని ఉపన్యసించారు ఇంకా Socialistic pattern of Society ని సరైన పద్ధతిలో నిర్మించుకోడానికి ఎగువ శాసనసభ అవసరాన్ని గుర్తుకు తెస్తూ మాట్లాడారు ఇప్పటి మంత్రి శ్రీ వల్లూరి బసవరాజుగారు చారిత్రిక విషయాలనూ, అంతర్జాతీయ పరిస్థితులనూ, ఇతర దేశాలలో ఉన్నట్టి ఎగువసభలను గురించి వివరిస్తూ మాట్లాడారు చాలా మంది సభ్యులు territorial interest మున్నగు విషయాలనన్నింటిని తీసుకువచ్చి అతిచాకచక్యంగా వాదనలు చేస్తూ ఎగువశాసనసభ అవసరాన్ని గుర్తింపజేశారు వీరందరికీ నేను సూటిగా సమాధానం చెప్పదలుచుకొన్నాను అసలు ఎగువ శాసనసభ హక్కులు ఏమిటి ? What are the powers and rights of the Upper House ? మొందట ఆ విషయాన్ని గుర్తించకుండా ఎగువ శాసనసభ అవసరాలను గుర్తింపజేస్తూ వాదోపవాదాలుచేస్తే ఏమీ లాభంలేదు బండిని ముందరబెట్టి, గుర్రాన్ని వెనకాలకట్టి నడవమంటే నడుస్తుందా? ఎట్లా నడుస్తుంది ? కాని మనం ఇప్పుడు ఆ విషయాన్ని గమనించడంలేదు ఈ విషయం మనం బాగా ఆలోచించాలి ఇండియాలో ఎగువశాసనసభలు ఉన్నాయి అవి సక్రమంగా చేసిన పనులేమిటి ? అవి వాటి హక్కులను వినియోగించుకొని ఇంతవరకు ప్రజలకు సౌకర్యాలు కలుగజేయుటకు, తప్పిదాలను సరిదిద్దుటకు, మంచి శాసనాలను అమలులోపెట్టుటకు ఏ విధంగా

ప్రయత్నంచేసినవి ? ఈ విషయాలు ఎవ్వరూ చెప్పటలేదు ౮ లక్షలు ఖర్చు, ౨ లక్షలు ఖర్చు అవుతున్నది పోలీసుపైన అక్కడ అంత ఖర్చుఅవుతున్నది— military పైన ఇక్కడ ఇంత ఖర్చు పెడుతున్నాము ఇదంతా ఖర్చు కానీయండి కౌన్సిల్‌కు కూడా ఖర్చు చేయండి కాని ప్రతిపక్షాలను ఒప్పించిన తరువాత ఏర్పాటుచేసుకొంటే బాగుంటుంది Opposition for opposition sake అని ఒక మిత్రుడు అన్నాడు ఆ మిత్రునికి నేను సమాధానం చెబుతున్నాను ఏ రీతిగానైనా ఇది నిజమైనని తెలిస్తే ఇంక ప్రజలు మన్నించరని నాకు తెలుసు కాని సోదర సభ్యులు చెప్పే వాదనలో పసఉండాలి సర్యైన వాదనలు చేస్తే నాకేమీ అభ్యంతరం ఉండదు Second five-year plan ను అమలుచేయుటకు ప్రజల్లో ఉత్సాహం కలగాలంటే రెండవసభ కావాలని శ్రీ రాజలింగంగారు చెప్పారు మొదటి పంచవర్ష ప్రణాళికలో పైనుంచి క్రిందకు దిగడం జరిగింది ఇప్పుడు క్రింద నుంచి పైకి వస్తున్నాము ఒక గ్రామంలో మొదలు పెడితే జిల్లా, రాష్ట్రం, స్థాయివరకూ తీసుకు వచ్చారు అవన్నీ మనందరకూ తెలుసు ఎగువ శాసనసభలో District Board members ఉంటారు Municipal Committee members వుంటారు పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన బాధ్యతలను వీరంతా నెరవేరుస్తారు ఎగువ శాసనసభ వుంటేనే పంచవర్ష ప్రణాళికను అమలుచేయగలుగుతాము లేకపోతే అమలుచేయడానికి అవకాశాలు లేవని చెబుతున్నారు

రాజకీయాలకు అతీతంగా ఉండేవారి నందరినీ మనం ఎగువ శాసనసభలలోనికి తీసుకొని వచ్చి, వారి సలహాలను తీసుకొనవచ్చునని కొంతమంది చెబుతున్నారు కాని నాకు తెలిసినంత వరకు రాజకీయాలంటే ప్రపంచంలో జీవించడమే అనుకొంటున్నాను ఒకరు పరోక్షంగా వుండవచ్చు ఇంకొకరు ప్రత్యక్షంగా వుండవచ్చు పరోక్షంగా ఉంటున్నవారు ఈ సభలోనికి రావడానికి అవకాశముంటే, అటువంటివారు రాదలచుకున్నప్పుడు ఇంక రెండవ సభఎందుకు ?

ఈ సభ హక్కులను గుర్తించాలని నేను ఇదివరకు మనవిచేశాను దీని powers ను గుర్తించకుండా మేము తీసుకువచ్చామంటే లాభంలేదు ఈ విధంగా చేస్తే నాకు మాత్రం అభ్యంతరం ఉన్నదని మనవిచేస్తున్నాను ఈ విషయమై చాలా మంది మనవిచేశారు గుర్రాన్ని వెనుక కట్టి బండిని ముందరకట్టిన విధంగా చేస్తే లాభంలేదు ఆ powers ను గుర్తించినప్పుడు వాటిని సాధించడానికి మనమంతా ప్రయత్నంచేస్తాము ఎవ్వరికీ అభ్యంతరం ఉండదు అందువల్ల powers లేనటువంటి బండికి గుర్రాన్ని కట్టి ఎక్కడకు పోయినా లాభంలేదు ఈ విషయమై మనం జాగ్రత్తగా ఆలోచించవలసియున్నది అధికారం లేనటువంటి కౌన్సిల్ ఏమీ ఉపయోగపడదు రాజకీయాలకు అతీతంగా ఉండే వారికి ఇందులో అవకాశం ఉన్నదనీ, ఇతరులకు అవకాశంలేదనీ, పంచవర్ష ప్రణాళిక విషయాలూ, State union సంఘాల విషయాలూ, ఇంకా ఇంతర విషయాలనూ చెబుతూ ప్రతిపక్షంవారిని ఒప్పించేందుకు ప్రయత్నించడంలో ఏమీ పసలేదు దాని విషయమై ఇదివరకే నిర్ణయం చేయడం జరిగింది ప్రతిపక్షాలను ఒప్పించుకొని, కొన్ని విషయాల్లో compromise చేసుకొని బలమైన democracy ని నిర్మించడానికి ప్రయత్నంచేస్తున్నామని శ్రీ వల్లూరి

